# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

వ్యవస్థాపకులు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౫]      ఆగస్టు 1953      [సంచిక ౮

# విషయసూచిక




స్వతంత్ర భారతపు పోకడలు 401
భవభూతి నిర్మిత చిత్రాలు: వేదుల మీనాక్షిగారు 403
తీరనిలోపం నీకో విదుషీ 'సుధాకిరణ్' గారు 408
శారదయౌవనము: ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు 409
నీ పెళ్ళెప్పుడు పాపా : కొమ్మూరి వేణుగోపాల రావుగారు 412
విండర్ మియర్ సతి విసనకర్ర : రామచంద్ర అగస్త్య ఎం. ఎ. గారు 417
సంతాప పరంపరలు 423
శ్రీమతి రసీల్ బాను 425
వంటయింటి సౌకర్యాలు : సి. లక్ష్మీపున్నయ్య గారు 426
పాకకళ 428
స్త్రీ బుద్ధి : ప్రళయాంతక : శ్రీధర జయలక్ష్మి గారు 430
ముచ్చట్లు : 'నారపీచు' 434
ఔదార్యం : దూతలూరి జగన్నాథంగారు 436
స్వామినాథన్ : చీమలపాటి సూర్యనారాయణ గారు 437
గృహవైద్యము 442
నారింజపండ్ల మారము లేదు : అద్దేపల్లి వెంకట సుబ్బారావుగారు 443
కీ. శే. కేసరిగారి సంస్మరణ : యస్. కే. సీతాదేవి గారు 445
బాలవినోదం 446
లోకవార్తలు 448
శుభశ్రావణి 450
మనదేశ భావలకు నాగరలిపి : వాకాటి పెంచల రెడ్డి గారు 452
స్వీకారము 453
సంపాదకీయములు 455
పంచాంగము 456



దేవతా ప్రీత్యర్థం




జయజయ గృహలక్ష్మి సఖీ ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# స్వతంత్ర భారతపు పోకడలు

స్వతంత్ర భారతదేశమునకు 6 సంవత్సరములు నిండినవి. ఈ నాడు 7వ స్వాతంత్ర్య దినమును జరుపుకొంటున్నది. కాని వాతావరణమంతా కారుచీకట్లు క్రమ్మినట్లు వివిధ క్లిష్ట సమస్యలతో అయోమయస్థితిలో నున్నది.

ఈ పరిస్థితులలో మనము యీనాడు స్వాతంత్ర్య దినోత్సవము జరుపుకోవడం ఉత్సవాలతోటి, ఊరేగింపులతోటి, పండుగ పబ్బాలతోటి, సభలు సమావేశాల తోటి మాత్రమని అనుకోగలమా?

ఉత్తేజంతో లక్షలాది ప్రజలు స్వాతంత్ర్య సమరంలో వీరోచితంగాపోరాడారు. కొందరు అఖండత్యాగాలుచేసే సందర్భమున దేశంకొరకు తమ ప్రాణములను సయితం అర్పించారు. వారందరిది ఆరోజుల్లో ఒకటే లక్ష్యం; అది దేశానికి, ప్రజలకు మహోజ్వలమైన భవిష్యత్తును ప్రసాదించగల స్వాతంత్ర్య సిద్ధి.

స్వాతంత్ర్యము సిద్ధించింది కాని దానిమూలంగా సమకూరవలసిన శాంతి, అభ్యుదయ సౌభాగ్యాలు మాత్రము యీ 6 సంవత్సరములలో దూరమగుతూ వచ్చినవి.

దేశంలో నలుమూలల నిరుద్యోగము, ఆకలిదప్పులు, అనారోగ్యం దైనికావసరములైన తిండి, బట్టల కరువు – యివి యెవి అనవసరములేకుండా ప్రబలిపోతున్నవి. ఈ సమస్యల పరిష్కారానికి అవకాశములు లేకకాదు; పరిష్కారము యెడల ప్రభుత్వము, ప్రజలు ఉమ్మడిగా ఆసక్తిచూపక బాధ్యతారహితంగా వ్యవహరించడమేకారణం. ఈ పరిస్థితులను మనము స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న సమయంలోగాని, మొదటి స్వాతంత్ర్యదినోత్సవము జరుపుకొనిన 6 సంవత్సరములనాడు కాని ఎదురుచూచి యుండము.

నిరుద్యోగానికి, ఆకలిదప్పుల వ్యాప్తికి జనాభా పెరుగుదల ఒక ప్రముఖకారణమనియు, అందుకుగాను జనాభా పెరుగుదల నరికట్టడానికి కృత్రిమ మార్గాల నన్వేషించాలనే వాదం చాల బలహీనమయింది. ప్రభుత్వము ఒక ప్రక్కనుండి ప్రజావసరాలకు మించి ఆహారం, గుడ్డ మొదలగు ప్రధానావసరములున్నవనియు, అయితే ప్రజలలో కొనుగోలు శక్తిక్రమంగా లోపించుచున్నదని ప్రకటిస్తునేయున్నది.

ఈ పరిస్థితులలో ప్రజలలో కొనుగోలు శక్తి పెరగడానికి, ప్రధానావసరముల ధరలు తగ్గడానికి ప్రజలు, ప్రభుత్వము పరస్పర సహకారములతో నిర్మాణాత్మకంగా కృషిచేస్తే సత్ఫలితాలు సమకూరుతవి.

దేశమా విశాలమైనది. వ్యవసాయమున కనువైనదిగానుండియు, సాగుకురానట్టి భూమి విశేషంగా నున్నది. నూతన పరిశ్రమల స్థాపనకుగాని, ప్రాజక్టులు, రహదారుల నిర్మాణమునకుగాని అవసరములు, అవకాశములు మెండుగానున్నవి. ఇవియన్నియు నిరుద్యోగ నిర్మూలమునకు వినియోగించుకో తగినవే. దానికి బదులుగా ఉన్న పరిశ్రమలను మూయడమో లేక మూసిన పరిశ్రమలను తెరిపించడానికి ప్రయత్నించకుండా మనము తయారుచేసి కొనకలుగు చక్కెరలాంటి ప్రధానవస్తువులను యితర దేశాలనుండి దిగుమతి చేయ ప్రయత్నించడమో, విదేశవ్యాపార, పారిశ్రామికసంస్థలకు ప్రత్యేకసౌకర్యాలు, అవకాశాలిస్తూ వారు ఆడిందాట, పాడింది పాటగా సాగనిస్తుండటమో ప్రభుత్వవిజ్ఞతను సూచించవు.

ఈ నాటి స్వాతంత్ర్యోత్సవాలలో తమ శ్రేయస్సుకు, పురోభివృద్ధి, శాంతి, అభ్యుదయాలను సాధించడానికి దీక్షాకంకణధారులు కావాలి. ప్రభుత్వము సయితము ప్రజల తక్షణ సమస్యలను సానుభూతితో పరిష్కారానికి శ్రద్ధవహిస్తే ప్రజాసహకార సానుభూతులకు ఏమి కొరతయుండదు.

దేశస్వాతంత్ర్యము కొరకు చేసిన త్యాగములుకాని, కృషికాని దేశంలో శాంతి సౌభాగ్యాలు నెలకొనిననాడుగాని ఫలించినట్లుకానేరవు.

# భవభూతి నిర్మిత చిత్రాలు

శ్రీమతి వేదుల మీనాక్షీ దేవి

"ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" కాళిదాసుకంటె ఉత్తరరామచరిత్రలో మహాకవి భవభూతి కవితాశక్తి మించిపోయి ఉన్నదని లోకంలో ఒక ప్రతీతి వున్నది.

ఉత్తరరామ చరిత్రలో ఒక ప్రత్యేకత కనబడు తుంది. ఒక్కొక్క శ్లోకం చదువుచున్నప్పుడా శ్లోక మందలి భావము మనకళ్లయెదుట బొమ్మవలె చిత్రించబడుతుంది. అనువైన మాటలతో ఇట్టే ఒక బొమ్మ కడతాడు. భవభూతి కవేకాకుండా చిత్రకారుడుకూడా అయివుంటాడనే భావం కలుగు తుంది చదివేవారికి.

గ్రంథారంభంలోనే సీతా చిత్రపట సందర్శనం ఆశ్రమంలో అంతవరకు అయిన కథాభాగంలోని రసవద్ఘట్టాలు పాఠకునికి జ్ఞాపకం చేస్తాడు. ప్రకృత కథాభాగంలో ప్రవేశించుటకు పాఠకుని సుముఖుణ్ణి చేస్తాడు. ఇట్టి చిత్రపటాలు భవభూతి కావ్యాల్లో సర్వత్రా కనబడుతున్నా కొన్ని శ్లోకాల్లో యీ బొమ్మలు మరీ స్పష్టంగా గోచరిస్తాయి. ఆ చిత్రాలు కాగితాలమీదో, గోడలమీదో చిత్రించ బడిన చిత్రాలవలె మాత్రమే కాకుండా ఒక విలక్షణమైన భావశబలత ప్రదర్శిస్తాయి.

◆ ◆ ◆

శ్రీరామ పట్టాభిషేక మహోత్సవములు పూర్తి కాగానే బంధుమిత్రులు తమ తమ నివాసాలకి వెళ్ళిపోయారు. అల్లుడైన ఋష్యశృంగుడు చేసే ద్వాదశ వర్ష యాగాన్ని చూడడానికి కులగురువులైన వసిష్ఠారుంధతులతో రాజమాతలు వెళ్లారు.

సీతాదేవి నిండు చూలాలు. ఆమె వినోదార్థం శ్రీరాముడు రామాయణ కథను బొమ్మలుగా వ్రాయించిన చిత్రపట సందర్శన సందర్భంలో సీతాదేవిని రావణుడు అపహరించినప్పుడు ఆమెను వెదకికొనుచు రామలక్ష్మణులు పంపాసరోవరం దగ్గరకు వచ్చిన దృశ్యం.

"ఏతస్మిన్మదకల మల్లికాక్షపక్ష
వ్యాధూత స్ఫురదురు దణ్డపుణ్డరీకాః
బాష్పాంభః పరిపతనోద్గ మాన్తరాలే
సన్దృష్టాః కువలయినో భువోవిభాగాః"

పంపాసరోవరం చాలా రమణీయంగా వుంటుంది. అగట్టున కూర్చుని శ్రీరాముడు సీతా వియోగము వలన కలిగిన విచారంవల్ల దుఃఖిస్తుంటాడు.

పెద్ద సరస్సు నిర్మలంగావున్న ఆకాశం నీళ్లలో ప్రతిఫలిస్తూంటుంది. సరస్సుచుట్టూ పచ్చిక ఆకు పచ్చని తివాసీ పఱచినట్లుంటుంది. దూరాన్ని చిన్న చిన్నచెట్లు కానవస్తూంటాయి. విచ్చిన కలవల మీదనుండి సువాసనతో కూడిన చల్లనిగాలి వీస్తూం టుంది. ఆ తెల్లకలువ దిగువ భాగాన్ని లావుపాటి తూడుకలిగి దూరంనుండి చూచేవారికి తెల్లగొడుగు వలె కనబడుతుంది. వాటి మొదట్లో తెల్లగా వెన్న ముద్దలలావున్నవి హంసలు.

నీటికి చేరువగా తేజశ్శాలు ఇద్దరు నారచీరలతో వుంటారు. వారిలో ఒకరిది నీలమేఘచ్ఛాయ. మరొకరిది పసిడిఛాయ, నీలమేఘ శరీరుడు కూర్చుని వుంటాడు. అతని చూపులు సరోవరంవైపే

వున్నాయి. కాని, అతని ముఖవైఖరిచూస్తే ఆ సరోవర రామణీయకం చూస్తున్నట్లులేదు. అతనికళ్ల వెంబడి నీరు సంతత ధారగాపడుతూ యెదటి వస్తువును కనబడనియ్యడంలేదు.

ఈ విధమైన చక్కని ఓ దృశ్యం మనకళ్ళముందు నిర్మించబడుతుంది.

ఈ శ్లోకం చదివినప్పుడు నిజంగా ఆ పంపా సరోవరరామణీయం చూసినట్లు ఒక తృప్తభావం పొందుతాం. దుఃఖిస్తున్న రాముని గురించి వూహ కలుగుతుంది. "అంత ధీరోదాత్తుడైనా సీతా వియోగంవల్ల పామరునివలె దుఃఖిస్తూన్నాడే" అనిపిస్తుంది. దుఃఖంతో బాష్పాంబువులు అనవరతము వెలువడుతుండగా సరోవరాన్నెలా చూశాడు అనే సందేహం మనస్సులో కలుగుతుంది. ఆ సరోవరం, ఆ పరిసర ప్రదేశాలూ యెంత దుఃఖంలోవున్నవాడైనా అంతలోనే చూడకుండా వుండలేకపోయేటంత మనోహరమైన దృశ్యాలయివుండాలని సమాధానపడుతుంది పాఠకుని మనస్సు.

♦ ♦ ♦

"శంబూకుడను శూద్ర తపసిని వధించిన బ్రాహ్మణ శిశువు జీవించు"నని అశరీరవాణి పలుకుతుంది. వెంటనే శ్రీరాముడు శూద్ర తపసిని వెదకికొంటూ విమానంమీద బయలుదేరి జనస్థానంలో తపస్సుచేసికొంటున్నవానిని వధిస్తాడు. బ్రాహ్మణ శిశువు బ్రతికినట్లు దివ్యపురుషుడుగా మారిన తపసి చెబుతాడు.

రాజధర్మ నిర్వహణకోసం బహిరింద్రియముల వ్యాపారం కేంద్రీకరించి వుండడంవల్ల రామునకది జనస్థానమనే విషయమే మనస్సుకి స్ఫురించదు. ఆ విషయం శంబూకుడు చెప్పగా విని "ఆఁ, ఇది జనస్థానమా" అని ప్రకృత స్మృతిని పొందుతాడు శ్రీరాముడు. అగస్త్యలోపాముద్రలను సందర్శిస్తాడు.

సీతారాములు పధ్నాలుగేండ్లు వనవాసంచేసినప్పుడు వారు సంచరించిన ప్రదేశాలలో పంచవటి, జనస్థానములు ముఖ్యమైనవి. శ్రీరాముడాప్రాంతాలకి వస్తున్నాడనివిని సీతావియోగంవల్ల విచారమనస్కుడైయున్న అతనికేవిధమైన హానియు కలుగకుండా సుఖకరంగా చెయ్యడానికి భాగీరథీ లోపాముద్రలు చాలా ప్రయత్నాలుచేశారు. వనదేవత వాసన్తి రామునికి స్వాగతం యిస్తుంది. భాగీరథి వరప్రభావంవల్ల ఆ ప్రాంతాల్లోనే వనదేవతలకు కూడా కనబడకుండా రాముని వెన్నంటి వుండడానికి గంగానదిలోనుండి గట్టుమీదనున్న అడవిలోనికి వస్తున్న సీతాదేవి ఆకారాన్ని వర్ణిస్తాడుకవి.

"పరిపాణ్డు దుర్బల కపోలసున్దరం
దధతీ విలోలకబరీక మాననం
కరుణస్యమూర్తి రథవాశరీరిణీ
విరహవ్యథైవ వనమేతి జానకీ"

తెల్లగా పాలిపోయిన చెక్కిళ్లతో ఒక స్త్రీమూర్తి శరీరం చాలా కృశించివుంటుంది. చిక్కినా అతిమానుషమైన తేజం ఆమెలో పొడగట్టుతున్నది. ఆమె ముఖంలోగాని, నేత్రాల్లోగాని ఆనందం కనబడ్డంలేదు. తైలసంస్కారంలేక జడలుకట్టిన జుట్టుముడి, మూర్తీభవించిన శోకదేవతవలె వుంటుంది. దుఃఖించడానికి ఆమె కన్నీళ్లుకూడా యింకిపోయాయేమోననిపిస్తుంది. శూన్యదృక్కులతో నదీగర్భం వెలువడివస్తోంది.

ఇంతవరకూ బొమ్మకట్టిన భవభూతి సీతా చిత్రానికి సమగ్ర స్వరూపం యివ్వడంకోసం మూర్తీభవించిన వియోగవ్యథఅనీ, తనువుదాల్చిన కరుణరసమనీ వ్యంగ్యంగా సూచించాడు.

ఈ ఘట్టంలో కరుణరసం వెల్లివిరుస్తున్నది. అప్పటి సీతాదేవిరూపమే తలుచుకుంటే జాలికలుగుతుంది "అయోన్య" అని. దేవయజనసంభవ, స్వజ

న్మను గ్రహపవిత్రత వసుంధర, పావకవసిష్ఠారుంధతీ ప్రశస్త శీలశాలిని, సవితృకుల వధువు అయిన సీతాదేవి పడనిబాధలులేవు. అంతఃపురమున సెండ కన్నెఱుగక సుఖపడవలసిన కోమలాంగి వనవాసమునకు భర్త ననుసరించి వెళ్ళింది. శ్రీరాముని దండకారణ్యవాస ప్రియసఖియైన సీతాదేవిని రావణాసురుడు అపహరించుకొనిపోయాడు. ఒక సంవత్సరము రాక్షసమధ్యవాసము, రావణవధానంతరం అయోధ్యకువచ్చి, పట్టాభిషేక మహోత్సవంజరిగి కష్టాలు గట్టెక్కినవని యనుకొనే సమయంలో జనాపవాదము, ఆ కారణంగా నీళ్ళాడు ప్రొద్దులప్పుడు ఒంటరిగా అడవిలో విడువబడుట - ఈ నాటి వనవాసానికి అవధిలేదు. జీవితంలో ఆశారేఖ లేదామెకు.

మనోవేగం చాలా గొప్పది. పాఠకునికి సీతాదేవి పూర్వగాథ క్షణంలో మెఱుపులాగ మెరుస్తుంది. మనసు దుఃఖపూరితమాతుంది.

♦ ♦ ♦

పరిచితములైన ఆయాభాగాలుచూస్తూ పంచవటిలో తిరుగుతూంటాడు శ్రీరాముడు. సీతారాములు సంచరించిన ప్రదేశాలు చూపించడంలో ఒక లతాగృహాన్ని శ్రీరామునికి చూపిస్తోంది వనదేవత వాసన్తి.

“అస్మిన్నేవ లతాగృహే త్వమభవ
స్తన్మార్గ దత్తేక్షణ
స్సాహంసైః కృతకౌతుకాచిరమభూ
ద్గోదావరీ సైకతే
ఆయాన్త్యా పరిదుర్మనాయిత మివ
త్వాం వీక్ష్య బద్ధస్తయా
కాతర్యాదరవిన్ద కుట్మలనిభో,
ముగ్ధః ప్రణామాఞ్జలిః”

విశాలమైన నిర్జనప్రదేశం. పువ్వుల తీగెలు పట్టంగా అల్లుకపోయి పెద్దపెద్ద లతాగృహాలు నిర్మించబడివున్నాయి. ఆ లతాగృహాలు ఆకులు, పువ్వులతో ఆకు పచ్చని చీరమీద రంగు పువ్వులద్దినట్లున్నాయి. లోపల విశాలంగాను, చీకటిగాను వుంటుంది. అందులో ఒక లతాగృహంవద్ద ఆజాను బాహువు, నీలమేఘ శరీరుడు, పీతాంబరధారి, ఆకర్ణాంత విశాలలోచనుడు అయిన ఒక పురుషుడు నిలబడి వుంటాడు. అతని యెదుట విశాలమైన స్థలం. కొంత దూరాన ఒక నది ప్రవహిస్తూంటుంది. మధ్య మధ్య యీదుతున్న హంసలు అస్పష్టంగా కనబడుతూంటాయి. ఆ పురుషునికి పదిబారల దూరంలో ఒక ముగ్ధ స్త్రీమూర్తి, సుందరాంగి యెదురుగా నిలబడి చేతులు జోడించి నమస్కారంచేస్తూ భీతహరిణేక్షణవలె వుంటుంది. చిగుళ్ళవలె యెఱ్ఱనైన ఆమె చేతులు జోడించి నమస్కరించుచున్నప్పుడు కోలగా తామర మొగ్గవలె వున్నది.

అమాయకంగా హంసల క్రీడలవంకచూస్తూ పర్ణశాలకు తిరిగిరావాలనీ, తనకోసం శ్రీరాముడు వేచియుండుననీ మఱచినది సీత. ఆమె పునరాగమనమునకై నిరీక్షించుటలో రాముడు కొంత వ్యగ్రత, చిరాకు పొందియుండవచ్చు. అదిచూచి సీత దూరము నుండియే నమస్కార బాణము వదలింది.

ఆమె ముగ్ధత్వానికి పాఠకునికి చిన్న నవ్వు వస్తుంది.

♦ ♦ ♦

రావణుడు సీత నపహరించుకొని పోతుండగా దశరథుని స్నేహితుడైన జటాయువనే పెద్దపక్షి చూసి రావణునితో యుద్ధంచేసి రథాన్ని విరగ్గొడుతుంది. రథ్యాలను చంపుతుంది. తన వాడి గోళ్ళతో రావణాసురుని నొప్పించి, చివరికి అతని ఖడ్గానికి యెఱఅయిపోతుంది.

ఆ నాడు జరిగిన సంఘటనని, గుర్తుకి తెస్తున్న ప్రదేశాన్ని చూపిస్తుంది శ్రీరామునికి వాసన్తి.

“పౌలస్త్యస్య జటాయుషా విఘటితః
కార్ష్ణాయసోఽయం రథ
స్తస్యైతే పురతః పిశాచవదనాః
కఙ్కాలశేషాః ఖరాః
ఖడ్గచ్ఛిన్న జటాయు పక్షతి రిత
స్సీతాం జ్వలన్తీం వహ
న్నంత ర్వ్యాకుల విద్యుదమ్బుద ఇవ
ద్యామభ్యుద స్థాదరిః”

దట్టమైన అరణ్యభాగం, భీకరాకారుడైన ఒక పురుషుడు పదితలలతో ఖడ్గహస్తుడైనిలిచి వుంటాడు. ఆకాశాన్ని కప్పివేసేట్టున్న తన పెద్ద రెక్కలను విప్పి ఆతనిమీదికి వస్తోంది పెద్ద పక్షి. గునపముల వంటి గోళ్లు, విప్పబడియున్న రెక్కలు మాత్రమే కనబడుతున్నాయి. ద్వంద్వ యుద్ధం జరగడంవల్ల భూమిమీద ధూళిరేగి సూర్యమండలంవఱకు వ్యాపించి యెండవేళ మబ్బువేసినట్లు తోస్తోంది. దూరంగా మెఱుపుతీగవంటి స్త్రీ నిలబడి భోరున దుఃఖిస్తూంటుంది. ఆమె జుట్టుముడి వీడి వుంటుంది. ఆ విధంగా మన కళ్ళయెదుటవున్న దృశ్యం చూస్తూండగానే అదృశ్యం అయిపోతుంది.

అదే స్థలంలో చిన్న చిన్న ముళ్ళ తుప్పలు, ఎండకు యెండి, వానకు తడిసి త్రుప్పుపట్టి పడియున్న యినుప రథం ముక్కలు, రావణాసురుని మహోజ్జ్వలమైన రథముయొక్క అస్తి పంజరమా అనిపిస్తుంది. కొంచెం దూరంలో మహోన్నతమైన ధనువు మధ్యకు విఱిగిపడివుంటుంది. గుఱ్ఱాల ఆకారంగా కనబడుతున్న అస్తి పంజరాలు కొన్ని నేలమీద వుంటాయి. ఎండకు యెండి, వానకు తడిసి యుండడంచేత శిధిలమై కొంత కొంత మట్టిలో కలిసిపోతున్నాయి. ఆ ప్రదేశం అంతా ధూళి ధూసరితమై యెండుటాకులతో నిండివుంటుంది.

ఒకప్పుడది యుద్ధరంగం అని చెప్పకుండానే తెలుస్తోంది. మిత్రుని కోడలైన సీతాదేవిని రావణుని బారినుండి రక్షించడానికి భీకరంగాపోరి చివరకు ప్రాణాలు సైతం త్యాగం చేసింది జటాయువు. నిజమైన మిత్రులంటే యిలాంటివారేకదా! ఆ త్యాగానికి ఆశ్చర్యం వేస్తుంది. ఒళ్లు జలదరిస్తుంది ఆ ప్రదేశాన్ని భావించుకుంటే.

రావణాసురుడు సామాన్యుడు కాడు. పులస్త్య బ్రహ్మకుమారుడు. అతిధైర్యశాలి. వీరుడు. తెల్లవారకమునుపే లేచి సప్త సముద్రాలలో గ్రుంకి, వేయి శివాలయములను దర్శించి, సేవించి వచ్చేవాడు. దేవ బ్రాహ్మణ భక్తుడు. అట్టి రావణాసురుడు దిగ్విజయాలు సాధించడానికి వెళ్లింది యీ రథం మీదే!

ఆ రథం, ఆ విల్లు ఆ విధంగా విఱిగిపడివుండడం రథానికి కట్టబడిన గుఱ్ఱాలు చచ్చిపోవడం యివన్నీ చూస్తే రావణునికి ముందు కలుగబోయే పతనసూచనలై యుంటాయని తోస్తుంది.

అంత గొప్పవాడైన రావణుడూ చివరికి వరగర్వంవల్ల సురాసుర గరుడోరగ కిన్నర కింపురుషులను, అష్టదిక్పాలకులను, పంచభూతములను తన బొమముడి మాత్రంచేత గడగడలాడించి లోకకంటకుడయాడు. ఇదికూడా పతనకారణమే! అని పాఠకుడు ఒక విధమైన అనుభూతిని పొందుతాడు.

♦ ♦ ♦

వాల్మీకి ఆశ్రమ భూములలోనికి వస్తుంది శ్రీరాముని యజ్ఞాశ్వము. ఆ ఆశ్రమంలోవున్న లవకుమారుడు పన్నెండేళ్ళవాడు గుఱ్ఱాన్ని పట్టుకుంటాడు. కూడావున్న భటులతోను, లక్ష్మణుని కుమారుడు చంద్రకేతువుతోను యుద్ధం చేస్తాడు. చివరికి

'జృంభకాస్త్రం ఉపయోగించి సేనని స్తంభింప జేస్తాడు. సరిగ్గా ఆ సమయానికే శంబూక వధానంతరం విమానంలో తిరిగి వెళ్లిపోతున్న శ్రీరాముడు వారిద్దరిమధ్య దిగుతాడు. వారిచే వారి వారి అస్త్రాలుపసంహరింపజేస్తాడు. తాము గానము చేస్తున్న రామాయణ కథా పురుషుడాయనయేనని చంద్రకేతువు చెప్పినప్పుడు ఆశ్చర్య భక్తి సంభ్రమాలతో నమస్కరిస్తాడు లవకుమారుడు.

కుశలవులను చూసినప్పుడు రామునికనిర్వాచ్యమైన ప్రేమకలుగుతుంది. వారికి జృంభకాస్త్రాలు ఆజన్మసిద్ధమైనవని విని ఆశ్చర్యపోతాడు. ఈ వీరులెవరిబిడ్డలైనదీ తెలియక ఆలోచనలో పడతాడు. సీతాదేవిని విడిచిపెట్టినది ఆ ప్రాంతంలోనే గనుక వీరామెబిడ్డలేమోనన్న ఆశపొడచూపుతుంది. దగ్గరగా ఆ బిడ్డల్ని పరీక్షించి చూస్తాడు. వారిలో సీతారాముల పోలికలే కాకుండా రఘుకుల కుమారచ్ఛాయలుకూడా కనబడతాయి. ఆ సందర్భంలో మహాకవి రఘుకుమారుల లక్షణాల్ని వర్ణించాడు.

"కఠోరపారావత కంఠ మేచకం
వపుర్వృషస్కంధ సుబంధురాంసకమ్
ప్రసన్న సింహస్తిమితంచ వీక్షితమ్
ధ్వనిశ్చమాఙ్గల్య మృదఙ్గమాంసలః"

విశాలమై, పరిశుభ్రమైన సమప్రదేశము. అక్కడక్కడ నీడనిచ్చే పెద్దపెద్ద వృక్షాలుంటాయి. మధ్య మధ్యనున్న పర్ణశాలలవల్లను, చెట్ల కొమ్మలకు ఆరగట్టిన కాషాయాంబరముల వల్లనూ అది ఆశ్రమ ప్రాంతమని తెలుస్తోంది.

ఎగు భుజములు. చక్కని ముఖాలు. విశాలమైన ఫాలభాగములు. ముడివేసికొనేందుకందక ఉంగరాలు తిరిగి మెడమీద నృత్యంచేస్తున్నట్లున్న అలకలు. పొడవైన కాళ్లు చేతులుగలిగి వయస్సుకి తగ్గపుష్టిగల గంభీరాకారులైన ఇద్దరు బాలురు కనబడతారు. వారి కళ్లు కలువరేకులవలె వుంటాయి. వాటిలో, శుభలక్షణమైన చిన్న యెఱ్ఱ జీరకూడావుంటుంది. ఆ కళ్లు వాళ్లముఖానికెంతో అందాన్నిస్తాయి. చూడడానికి వారిద్దరూ గంభీరమైన సింహశాబకాలవలె కనబడతారు. కాని, వారి చూపులలో క్రౌర్యంలేదు. అమాయకమైన, ప్రసన్నమైన చూపులవి. చూపులతోనే గ్రహించే తెలివితేటలు, చూపులతోనే ముల్లోకాల్నీ తృణీకరించే ధీమా కనబడుతుంది వారిలో మనకి.

ఒక పెద్దచెట్టునీడని వారిద్దరూ కూర్చుని వుంటారు. వారి మధ్య మహాపురుష గుణాలుకల ఒక పురుషుడు కూర్చుని వారిద్దరిమీద తనరెండుచేతులు వేసి వారిని నిమురుతూంటాడు ప్రేమగా. పైకి గాంభీర్యమేగాని అతని ముఖంలో తెలియనియేదో ఆవేదన, ఆతురత కనబడుతూవుంటుంది. మళ్లీమళ్లీ వారి ముఖాలు పరకాయించి చూస్తాడు. అతని నేత్రాలు అశ్రుపూరితాలౌతాయి.

సమానాకార గాంభీర్య శుభలక్షణాలుగల ఆ ఇద్దరు బాలురు ముద్దుగా కనబడతారు. మనమనసు నాకర్షిస్తారు. వారిపై అవ్యాజమైన ప్రేమ కలుగుతుంది. మనస్సెంతో నిండుగా ఉన్నట్టుంటుంది. "ఇట్టి బిడ్డలు ఆశ్రమ వాసులయ్యారే' అని బాధగా ఉంటుంది. వారి శుభలక్షణాలకు ఒళ్లు పులకరిస్తుంది.

కరుణరసం వర్ణించి గుండెల్లోని రక్తాన్ని పిండిన భవభూతి పాఠకుని మనస్సు శాంతించడానికి కుశలవ కుమారుల ప్రదర్శనంతో సద్యః ఫలనిర్వృతి కలిగిస్తాడు.

◆ ◆ ◆

ఇంతకూ భవభూతి మహాకవి పరిణత ప్రజ్ఞుడు. దిఙ్మాత్రంగా ఆయన వైశిష్ట్యమును ఇచ్చట సూచించడమైనది. ఉత్తరరామచరిత్రలో ఎల్లెడల ఇట్టి చిత్రపటములు లెక్కకుమిక్కిలిగా ఉన్నవి.



# తీరని లోపం నీకో విదుషీ

'సుధాకిరణ్'

ఓ గంభీర హృదయ !
సాగర దయామయ !
పునీత జీవిత ధన్య !
వదాన్య మూర్ధన్య !
త్యాగ నిరంజన జీవీ !
అనురాగమయ సంజీవీ !
నీ సుకుమార మానసోత్పలము
ఆంధ్ర సుకుమారికలకొక సత్ఫలము !
నీ యపురూప జీవిత
    స్వరూపము
ఆంధ్రయశ ప్రాసాదమునకొక
    దీపము !
నీ పుత్రిక - ఈ పత్రిక
— విదుషీమణికొక జ్ఞానదీపిక !
— సీమంతిని ముంజేతికి సువర్ణ శలాక !
ఓహో ! మహిళాజన వైతాళిక !
జోహారులు ! 'గృహలక్ష్మి' సంస్థాపక !!
జోహారులు ! అసమాన మనీషీ !!!
— తీరని లోపం ! నీకో విదుషీ !!

# శారదయౌవనము

పరమహంస - యను కావ్యమునుండి

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

పొంగులువారు యౌవనముపొందిక లందపుమేనికిన్ జగా
రంగులగూర్చి క్రొమ్మిసిమిరంజిలజేయు వియోగబాధకున్
లొంగియధీరయై తనకు లొంగని చిత్తముతోడ స్వామికిన్
చెంగటజేరు భావనలచేడియ ప్రొద్దులుబుచ్చు నిచ్చటన్ ॥

భర్తృగత భావనావేశ భరితయగుచు - విస్మృతాన్య ప్రపంచయై వెలదిమిన్న
వెచ్చనూర్పును దమలోన విహ్వలించు - పలవరించును వలపుల కలవరించు॥

పరమహంసుని, మానససరసిదెల్పి - తాను కైలాసమయ్యెచో తరుణియపుడు
నిత్యముక్తుని తనలోన నిలుపుకొన్న - ప్రకృతియే తానుకాదొకో పడతియంత ॥

పరమహంసుని భావనాసరసిదేవి - పరమహంసియె తానయ్యె భామయపుడు
నిత్యముక్తుని సంస్మృతి నియతిదగిలి అన్యచింతనాముక్తయై అతివమెఱసె ॥

భవవిరక్తుని నామజపమ్ము సేసి - పరసుఖాసక్తి భాసిల్లుపడతిచూడ
అగు నిధివిధానమతినిగూఢ మద్భుతమ్ము - భావిచరిత రచించు సూబాలచరిత ॥

వ. అంత
శమినుండి విజయుండు శస్త్రావళినిదించి - కౌరవ్యవిజయమ్ము గనినదినము
మాతమాహేశ్వరి మహిషాసురుంగూల్చి - జగతికానందమ్ము సలుపుదినము
పృథ్వీపతులు శత్రునృపమండలినిగెల్వ - విజయయాత్రలుసల్పు విహితదినము
బాలబాలికలెల్ల - పరమాభిమతమున - బాణాసనమ్ములు పట్టుదినము
సర్వజన సమ్మతంబగు పర్వదినము - కూతులల్లుండ్ర కోర్కెల గూర్చుదినము
వంగభూమికి ఎంతహొరంగులిడుచు - జగతికరుదెంచె దశమి పండుగదినము॥

దసరాపండుగవచ్చిన - వెసవెసజామాతలెల్ల విందులుగుడువన్
శ్వశుర గృహమ్ములుసేరిరి - అసదృశుడగునల్ల పరమహంసయెవక్కన్॥

చెక్కిటచేతినిజేరిచి - మక్కువ తన్నాథురూపు మనసున గనుచున్
మిక్కిలి మురిసెడు తరుణిని - గ్రక్కున చెలులెల్ల వేడ్కగదిసియునాలోన్॥

ఏమమ్మా నీ పెనిమిటి - కేమమ్మా ఇంతనీటు - ఎంతటివాడో
ఏమనుచు మమ్ముదలచెనో - భామా, నీ విభుడురాడు పండుగకైనన్ !

'కామిని' చూచితే 'లలిత' కాంతునిగూడి సుఖించుపండుగన్
'కోమలి' కాంచుమా 'గిరిజ' కూర్మిధవున్ సరసోక్తులాడుటల్
'భామిని' చూడవే 'విమల' భర్తనుతోడనె తెచ్చె నింతకున్
'శ్యామ' ఇదేమె నీ సుఖముచాలును! నాథుడు రాకపండుగే ॥

అరరే ఎంతటి చోద్యమమ్మ ఇటులెందైనం గనుంగొంటిమే
కలిపోమానిని లోకమందు పతులే కళ్యాణులున్ బొందరో యోగతుల్
అరుదా నీదుకతల్వినవ్వినగ అయ్యా రేమహా మోహముల్
భరమున్ బూనెదే నీదుజీవితము నే బ్రాసిన్ పతిన్ గోరుచున్ ॥

మగడు వెడగైననే యింతమనసుదగిలె - అతడు తగువాడెయైన నొయ్యారినీమె
పట్టశక్యములగునటే, పలుకడిపుడె - చిత్రమని రవాళించుచు చెలులుజనిరి.

తనమగడు వెడగటంచును దడవితడవి - చెలులు గేలిసేసిననంత తెలిసితెలిసి
తనబ్రదుకె భారమనుచును దలచితలచి - బాలమనమున శోకించె పనవిపనవి ॥

అయినను

సంసృతి బంధముల్ చయ్యనగోసెడు - ధీమంతునకుదాను దెలివయట్టి
దేవదేవుని దెల్పు దివ్యమనీషికి - ప్రజ్ఞానిధికిదాను భార్యయట్టి
అఖిలాత్మ సంస్మరణానందమునదేలు - ధన్యజీవికిదాను తన్వియట్టి
భక్తసంతతిబ్రోవ పరమహంసుండైన - మహితాత్మునకు దాను మగువయట్టి
తనయునికియేమొ తానేమొ తలపుగొనక - చెలులు కేరడమాడిన చెదరిచెదరి
పోవునటు వాయుహతికూగు పూవువోలె - బాలసామాన్య సతిబోలె బేలయగుచు॥

తనమగడు పిచ్చివాడని - పనిగొని లోకమ్ము తన్ను పలుచన సేయన్
వినియు సమాయిక శారద - విననట్టుల పదిలపడె వివేకము మెఱయన్ ॥

పరులమాట నింతపాటింపదగునటు - ఇంతకసలు నాథుడెట్టివాడో
అనెడియూహమొలచి మనసున తహతహ - పుట్టె ప్రాణవిభుని పట్టుజేర ॥

ఏవిధి కోరిక దీరున - నావిభుకడకంపుడనుచు నానయుతేకే
ఏవతే పితరుల నడుగుదు - ఆ విధియెట్టుల లిఖించెనది తెలియదుబో ॥

కన్నుల కఱవులు దీరగ - నెన్నడు వీక్షింతు నాదు హృదయేశ్వరునిన్
ఎన్నడు జీవిత కుసుమము సన్నుత తత్పాదయుగళి సన్నిధి జేర్తున్ ॥

వ. ఇట్లు కొంత వడి చింతించి యెట్టకేలకు
పితరుల జేరి ఎట్టెటో యభీప్సితముం దెలియంగ బల్కుచున్
నతులనొనర్చుచున్ కడకు నా విభు జేర్పుడు నన్నటంచు వే
వితముల వారి పాదముల వేడుచు కన్నుల నీరు నించుచున్
మతిగలగించి వారి కడ మాటను బొందెను నెట్టకేలకున్ ॥

ఆశను గొని శారద హృద - యేశుని గడకేగ నిశ్చయించెనొ లేదో
ఆ శుగము విడిచి యనంగుడు - ఆశాశలపతిని వెదుకన బలను ద్రిప్పెన్ ॥



# నీ పెళ్ళెప్పుడు పాపా?

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

"నీ పెళ్ళెప్పుడు పాపా?" అనడిగాడు విశ్వపతి పదేళ్ళపిల్ల మణిని ఉద్దేశించి. మణిసిగ్గుపడి తలవంచుకున్నది.

మణి సిగ్గుపడితే చెక్కిళ్ళు ఎర్రబారినయ్. కళ్ళలో వింతకాంతి తొణికిసలాడింది. ముద్దులమూటగట్టే ఆ ముఖాన్ని చూసి ముగ్ధుడయాడు విశ్వపతి.

విశ్వపతికీ, రమామణికీ స్నేహం. విశ్వపతికి నలభయిఅయిదు ఏళ్లు. మణికి పదేళ్లు. అయినా రెండేళ్లనుంచీ వాళ్లిద్దరికీ ఎడతెగని స్నేహం.

విశ్వపతి వంటరిగాడు. అతనికి భార్యలేదు. అసలు అతను పెళ్లిచేసుకోలేదో లేక భార్యచనిపోయిందో ఎవరికీ తెలియదు. అతను మాత్రం వంటరిగానే జీవనం సాగిస్తున్నాడు. నౌఖరు కేశవులు మాత్రం అతన్నెప్పుడూ అంటిపెట్టుకుని వుంటాడు. ఈ లోకంలో అతనికి ఆత్మీయులంటూ ఎవరైనా వుంటే ఆ వ్యక్తి కేశవులే నేమో.

విశ్వపతి ఆ వూరు వచ్చి మూడు సంవత్సరాలయింది. అతను ఎవరికోసం బ్రతుకుతున్నాడో అతనికే తెలీదు. ఒక ఏడాది వేరే ప్రమేయం లేకుండా గడిపాడు. కాని ఆతర్వాతే యితనికో నూతన స్నేహితురాలు తటస్థపడింది.

ఒకరోజు ఉదయం అతను కాఫీత్రాగి సావిట్లో కూచుని పేపరు చూస్తున్నాడు. అప్రయత్నంగా అతను పేపరుమీదనుంచి దృష్టిమరలించి వీధివైపు చూసేసరికి చేతిలో పుస్తకాలసంచీ పట్టుకుని చకచకా నడిచిపోతున్న ఎనిమిదేళ్ల అమ్మాయి కనిపించింది. విశ్వపతి ఒక్కసారిగా చకితుడయ్యాడు. ఆ అమ్మాయి పోయిన దిక్కువైపే చూస్తూవుండిపోయాడు. ఎందుచేతనో అతన్ని ఆకర్షించింది ఆ పిల్ల.

మరునాడు ఉదయం అదేవేళకు విశ్వపతి సావిట్లో కూచుని బయటకు చూస్తూ కూచున్నాడు. సరిగ్గా నిన్నటివేళకే ఆ పిల్ల సంచి బుజాన తగిలించుకుని, గాలికిరేగుతున్న జుట్టును వెనక్కి ఎగదోసుకుంటూ పోతూ కనిపించింది.

"ఇటురా పాపా!" అని పిలిచాడు విశ్వపతి.

ఆ అమ్మాయి తటస్థంగా చూస్తూ నిల్చుండిపోయింది. ఈ నూతనాగంతకుడు తనను పిలిచే అవసరం ఏముందా? అని ఆలోచిస్తున్నట్లుంది.

"నిన్నే పాపా!" అని తిరిగి పిలిచాడు విశ్వపతి.

ఆ అమ్మాయి సంశయిస్తూ దగ్గరకువచ్చింది. విశ్వపతి ఆమెను తనదగ్గర కూచోపెట్టుకున్నాడు.

"నీ పేరేమిటమ్మా?"

"రమామణీ" అని చెప్పిందాపిల్ల.

"ఇటువేపు ఎక్కడకీ పోతున్నావు?" అనడిగాడు విశ్వపతి.

"బడికండీ. నేను మూడోక్లాసు చదువుతున్నాను!" అని జవాబు చెప్పింది మణి మరోసారి అడిగించుకోకుండానే

"అలాగా అమ్మా. అయితేను యింతకుముందు ఎప్పుడూ కనిపించలేదేవమ్మా యిటువైపు పోతూనూ."

"నేనింతకుముందు యింకో బడిలో చదివేదానినండీ. ఇప్పుడు అక్కడినుంచి యింకో బళ్ళోకి మారిపోయాను" అని చెప్పింది మణి.

తరువాత వాళ్ళనాన్నగారు పేరూ అదీ అడిగి తెలుసుకున్నాడు విశ్వపతి. ఆయన పేరు రామారావుగారట. ఏదో ఆఫీసులో గుమస్తా పనిచేస్తున్నాడట.

విశ్వపతి, కేశవుల్ని పిలిచి లోపలనుంచి రెండు కమలాఫలాలు తెప్పించి ఆమె సంచీలో పడవేశాడు.

"వద్దండీ" అందిమణి. తన విషయంలో యితని కెందుకింత శ్రద్ధ ఆవహించిందా అని ఆశ్చర్యపడుతోంది ఆ పిల్ల.

"ఎందుచేత?"

"మీ రెవరో నాకు తెలీదు. మా అమ్మ కోప్పడుతుందేమో"

విశ్వపతి నవ్వాడు. "పర్వాలేదులే పాపా, నేను నీ స్నేహితుడ్నేగా! ఇవేళనుంచీ నీకూ నాకూ స్నేహం. తెలిసిందా!" అన్నాడు.

ఆ పిల్ల ఆశ్చర్యంగా యితని ముహంలోకి చూసింది. అంత పెద్దమనిషికీ తనకూ స్నేహంఏమిటి లేకపోతే! అనుకుందేమో మనస్సులో.

"సరేనా" అన్నాడు విశ్వపతి.

"ఊఁ" అంది ఎలాగో.

తర్వాతమణి బడికి వెళ్ళిపోయింది. విశ్వపతి ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

మరునాటినుంచీ రోజూ ఆవేళకు యిద్దరూ కలుసుకునేవారు. శని ఆదివారాలు వచ్చాయంటే విశ్వపతికి ప్రాణాంతకంగావుండేది. శని ఆదివారాలు రమామణికి బడివుండదు. రోజూ కలుసుకుని మాట్లాడటం అలవాటయిన విశ్వపతికి అటువంటప్పుడు ఏమితోచేదికాదు. అందుచేత "సెలవు రోజుల్లో కూడా వస్తూండుపాపా, నువ్వురాకపోతే నాకేమీ తోచదు" అని అంటూండేవాడు. మణి తలవూపేది కాని సెలవుల్లో ఎప్పుడోగాని వచ్చేదికాదు.

మణి, విశ్వపతిని బాబాయ్ అని పిలవటం అలవర్చుకుంది. రోజులు గడిచేకొద్దీ యిద్దరి మధ్యా చనువు అధికంకాసాగింది. విశ్వపతి ఆ పిల్లతో అనేక కబుర్లు చెప్పేవాడు. ఎన్నో ప్రశ్నలు వేసేవాడు.

"మీయింట్లో నాగురించి చెప్పావా పాపా?" అనడిగాడు ఒకసారి.

"ఊఁ" అని తలవూపింది మణి.

"నాగురించి మీ అమ్మా నాన్నా వాళ్ళు ఏమనుకుంటారు?" అని ఆరాటంగా ప్రశ్నించాడు తిరిగి.

"మొదట నేను చెప్పినప్పుడు పెద్దవాళ్ళ స్నేహం చెయ్యకూడదు. వద్దు అన్నారు. కాని బాబాయ్ మంచివారు అని చెప్పాను. అప్పట్నుంచీ ఏమి అనటంలేదు." అని చెప్పింది మణి.

"నేనంటే నీకిష్టమేనా పాపా?" అనడిగాడు మరోసారి.

"ఊఁ" అంది ఆపిల్ల.

"ఎంత యిష్టం-చాలానా" అని ప్రశ్నించాడు ఉత్సుకంతో.

"చాలా" అంటూనవ్వింది మణి. విశ్వపతి సంతోషపరవశుడయిపోయాడు.

ఆ అమ్మాయి వచ్చినప్పుడల్లా ఏదో ఒకటి యిచ్చేవాడు. ఒకసారి బిస్కట్ల పొట్లం కొనిచ్చేవాడు. మరోసారి బొమ్మేదయినా తెచ్చి యిచ్చే

వాడు. ఏవో ఫలాలు యిస్తూండేవాడు అప్పు డప్పుడు “పిల్లలు కాఫీ తాగకూడదు. జబ్బు చేస్తుంది” అని చిక్కని పాలు కప్పుల్లోపోసి యిచ్చి త్రాగించేవాడు.

ఒక రోజున ఆ పిల్ల అడిగింది “మీరు నాకు రోజూ ఏదో ఒకటి యిస్తున్నారు కదా బాబాయీ! మీడబ్బంతా అయిపోదూ ? ” అని.

“ఊహు. నాకు చాలా డబ్బువుంది. ”అన్నాడు విశ్వపతి.

“చాలా నా ! అంటే? ”

“అంటే లెక్క లేనంత. ఎంత ఖర్చు చేసినా యింకా వుంటూనేవుంటుంది ” అనిచెప్పాడు. చిన్న పిల్ల విస్తుపోయింది.

ఒక రోజు మణి చిరిగినగౌను వేసుకునివచ్చింది. విశ్వపతి ప్రాణం కొట్టుకుపోయింది. ఇటువంటిది వేసుకుని వచ్చావేం ? ” అని అడిగాడు ఆత్రంగా.

“చిరిగిపోయింది. ” అనిచెప్పిందిమణి అమాయ కంగా.

ఆ సాయంత్రమే అతనుపోయి రెండు రెడీమేడ్ గౌన్లు తీసుకున్నాడు ఖరీదులో. మరునాడు మణి వచ్చినప్పుడు ఆమెచేతికిచ్చాడు. మణి మురిసి పోయింది వాటిని చూసుకుని. ఆమె ముఖంలో సంతోషంచూసి యితను మురిసిపోయాడు.

మరునాడు మణి వచ్చినప్పుడు అడిగాడు “నిన్న యిచ్చినవిచూసి యింట్లో ఏమన్నార”ని

“పాపం ఎవరో పిల్లలులేనివాడు కాబోలు” అన్నారని చెప్పింది మణి. విశ్వపతి ముఖంలో విషాదఛాయలు ఆవరించాయి.

అప్పుడప్పుడూ ఛలోక్తికి అంటూండేవాడు. “నీ పెళ్లెప్పుడు పాపా ? ” అని. ఇది విని మణి సిగ్గులో మునిగిపోయేది. ఆ ప్రశ్న అడిగేటప్పుడు విశ్వపతిముఖ కవళికలుకూడా అదోవిధంగా మారి పోయేవి.

ఈ విధంగా వాళ్ల యిద్దరి స్నేహంతో చాలా రోజులు గడిచిపోయాయి.

◆ ◆ ◆

“నీకివాళో మంచి బహుమానం పాపా” అన్నాడు విశ్వపతి ఆ రోజు ఉదయం.

మణి ప్రశ్నార్థకంగా చూసింది.

“ఏమిటో చెప్పకో” అన్నాడు విశ్వపతి తిరిగి.

మణి ఆలోచించింది. -“బిస్కెట్లా ” అని అడిగింది.

“ఊహు”

“పిప్పరమెంట్లు”

“కాదు”

“బొమ్మలు”

“అబ్బే”

మణి ఆలోచించింది మళ్లీ. “ఊ. తెలిసి పోయింది” అంది కొంత సేపయింతర్వాత.

విశ్వపతి ఓడిపోయిన మొహం పెట్టాడు “ఏమిటి ? ”

“అమ్మాయి ఆశ. నేను చెప్పను” అంది మణి.

“నీకు తెలీదు. అబద్ధమాడుతున్నావు” అన్నాడు విశ్వపతి.

“కాదు తెలుసు. అయినా చెప్పను”

“అమ్మ గడుసుపిల్లవే” అంటూ జేబులోంచి ఒక అందమైన అట్టపెట్టె బైటికి తీశాడు. రమా

మణి ఆశ్చర్యంగా చూస్తూంది. విశ్వపతి ఆ పెట్టె తెరిచి అందులోంచి ఒక అందమైన బంగారపు గొలుసుని బయటకు తీశాడు. మణి తెల్లబోయింది.

"ఇదెవరికి ?"

"ఇంకెవరికి ? నీకే" అంటూ ఆ పిల్ల మెళ్ళో తగిలించబోయాడు గొలుసును.

"అమ్మో. మా యింట్లో కోప్పడతారు. వద్దు బాబాయ్" అంది భయంగా మణి.

"ఎందుకు కోప్పడతారు పాపా ? బాబాయ్ యిచ్చాడని చెప్పు"

అయినా మణి భయంపోలేదు. తనకా గొలుసు వద్దని చెప్పింది తిరిగి. విశ్వపతి ఒప్పుకోలేదు. ఎలాగయితేనే ఆ పిల్లను అంగీకరింపచేసి మెళ్ళో తగిలించాడు దాన్ని. తర్వాత కొంతసేపటికి "వెళ్తాను బాబాయ్" అని చెప్పి వెళ్ళిపోయింది మణి.

విశ్వపతి ఆలోచిస్తూ వుండిపోయాడు.

♦ ♦ ♦

మరునాడు మామూలు వేళకు విశ్వపతి సావిట్లో కూచుని రమామణికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

బడిగంటకొట్టి పావుగంటయింది. పిల్లలందరూ యిందాకెప్పుడో వెళ్ళిపోయారు. బడివేళకు ఒక అరగంటయినా ముందువచ్చే మణి ఆనాడెందుచేతో యింకా రాలేదు.

విశ్వపతి అప్పటికింకా కాఫీకూడా తీసుకోలేదు. నిన్న యిచ్చిన గొలుసు విషయం యింట్లో ఏమన్నారో కనుక్కుందామని అతని ఆతురత. మణి రోజూవచ్చే వీధివైపు చూస్తూ చాలాసేపు కూచుండిపోయాడు.

"ఇంకా కాఫీ పుచ్చుకోలేదు బాబూ" అని జ్ఞాపకంచేశాడు కేశవులు యజమానివద్దకువచ్చి.

విశ్వపతి తలఎత్తిచూశాడు.

"ఇక్కడకు తీసుకురమ్మన్నారా బాబూ ?"

"వద్దు. కొంచంసేపుండి త్రాగుతాను"

కేశవులు వెళ్ళిపోయాడు. విశ్వపతి యింకా ఎదురు చూస్తూనే వున్నాడు. మణి యివ్వాళింకా ఎందుచేతరాలేదు ? ఎప్పుడూ యింత ఆలశ్యంచేసి ఎరగదే. అయితే ఎందుచేత యింత ఆలశ్యం ? వాళ్ళింట్లో నిజంగా కోప్పడ్డారేమో ! ఎవరు మాత్రం వూరుకుంటారు లేకపోతే. ఒక బంగారపు గొలుసు ఎవరో యిచ్చారని తెలిస్తే వాళ్ళకు అనుమానం కలక్కుండా ఎలా వుంటుంది ? తనెవరో యింతవరకూ వాళ్లకు తెలీదు. తను రోజూ ఏవేవో యిచ్చి పంపిస్తున్నా వాళ్లు వూరుకున్నారు. కాని తను యిటువంటిపని చేసినందుకు యిక యీ విషయంలో వుపేక్ష చేస్తూ వూరుకోరు.

వాళ్ళది తిరిగి పంపించేస్తారేమో ! మణిని తనతో మాట్లాడవద్దని శాసిస్తే ?

విశ్వపతి హృదయం ఝల్లుమంది. తను అనవసరంగా యిటువంటిపని ఎందుకుచేశాడు ? చేతులారా క్లిష్టపరిస్థితిని ఎందుకు తెచ్చుకున్నాడు ?

ఆలోచిస్తున్న విశ్వపతి నిస్పృహపడ్డాడు. పోనీ యీ విషయం చెప్పటానికైనా, "మా యింట్లో యిది వద్దన్నారు" అని చెప్పటానికైనా మణి యిక్కడకి రావాలిగా. బడికిపోకుండా ఎందుకుంది ? ఆమెకేమయినా అపాయం వాటిల్లలేదుకదా ! అసలే యీ రోడ్డుమీద చాలా రద్దీగా వుంటుంది. కార్లూ, బస్లూ ఎప్పుడూ విరామంలేకుండా తిరుగుతూనే వుంటాయి. చిన్నపిల్ల ! పొరపాటున ...

ఛ ఛ, అయినా యిదేం ఆలోచన ? యిన్నాళ్ళనుంచీ మణి సరిగ్గా రావటల్లేదూ ? ఇంట్లో ఏద

యినా పని ఎక్కువవల్ల రాలేకపోయిందేమో. అంతే అయివుంటుంది అని సమాధానం చెప్పుకున్నాడు.

"కాఫీ చల్లారిపోతూంది బాబూ" అని తిరిగి జ్ఞాపకంచేశాడు కేశవులు.

"సరేపద. వస్తున్నాను" అంటూ భారంగా లేచి లోపలకు వెళ్ళాడు విశ్వపతి.

ఆ రోజంతా చాలా చిరాగ్గా గడిచింది విశ్వపతికి. మరునాడు ఉదయంకోసం కనిపెట్టుకు కూచున్నాడు అతను. మరురోజురాగానే మణిని ఎప్పుడు కలుద్దామా అని ఆవేదన.

ఆ రోజు గడిచిపోయింది. మరునాటి ఉదయం అదేవేళకు సావిట్లోకివచ్చి కూచున్నాడు విశ్వపతి.

నిన్నటిమాదిరిగానే బడిపిల్లలందరూ వెళ్లిపోతున్నారు. వాళ్ళందరివంకా తదేక దీక్షతో చూశాడు విశ్వపతి! ఊహు. మణి కనిపించలేదు. ఒకవేళ తనను తప్పించుకుపోదామన్న ఉద్దేశంతో చాటుగా పోతుందేమోననుకుని బడికిపోతున్న ప్రతి పిల్లనూ పరిశీలించిచూశాడు. ఏదీ మణి?

మణిని చూడాలి. ఏమయినాసరే. ఆ పిల్లను చూసి తీరాలి. చూడకుండా తనువుండలేడు. ఆ మణికేం సంభవించింది? రెండు రోజులు వరుసగా ఎందుకు రాలేదు?

ఆమె యింటికి వెడితే? అది బాగుంటుందా? తప్పేముంది? పోయి మణితలిదండ్రులతో తనుపరిచయంచేసుకుంటే వాళ్లేమీ అనుకోరు. మణికీతనకూ స్నేహం అని చెప్తే వాళ్లేమీ ఆటంకంచెప్పరు.

విశ్వపతి బయలుదేరాడు. మణియిల్లు అతను యింతవరకూ చూడకపోయినా ఎక్కడవున్నదీ తెలుసు. ఆ పిల్లను గుర్తుగా అడిగితెలుసుకున్నాడు.

అయిదునిమిషాల్లో ఆ వీధిమలుపు తిరిగాడు. రామాలయం దగ్గర పెంకుటిల్లు అని చెప్పిందిమణి. తను యిటువైపు ఎప్పుడోకాని రాడు. వెనకటికి ఒకసారివస్తే యిక్కడ రామాలయం చూసినట్లు గుర్తువున్నది.

విశ్వపతి మరోకొంతదూరం నడిచాడు. అదిగో! దూరంగా ఆలయం కనిపిస్తూంది! గబగబ అక్కడికి చేరుకున్నాడు. పెంకుటిల్లు! ఎక్కడ?

కాని అక్కడ ఒకటికాదు అటువంటి యిళ్లు వున్నవి; అయిదారువున్నాయి. తను ఎవరియింట్లోకి పోయి అడుగుతాడు? విశ్వపతి ఆలోచిస్తూ నిల్చుండి పోయాడు. అంతలోనే ఒక యింటితలుపు తెరచుకుని ఒకాయన బైటికి వచ్చాడు. విశ్వపతి గబగబ ఆయన దగ్గరకుపోయి అడిగాడు "రామారావుగారి యిల్లు ఏదండీ?"

ఆ వ్యక్తి పోబోతున్నవాడల్లా ఆగి దానికి రెండిళ్ల అవతలనున్న పెంకుటిల్లు చూపించాడు. ఆయనకు కృతజ్ఞత చెప్పి ఆ యింటిని సమీపించాడు విశ్వపతి.

ఏమని పిలవాలి?

"రామారావుగారూ!" అన్నాడు మెల్లిగా

ఎవరూ పలకలేదు. తడబడుతున్న చేతితో మెల్లిగా తలుపులు తోసిచూచాడు. దగ్గరగా వేసివున్నాయేమో అవి వెంటనే విడివడినై. విశ్వపతి లోపలకు తొంగిచూశాడు. మణి! మంచంమీద పడుకునివుంది. తల అటువైపు త్రిప్పివుంది. ఇక వుపేక్షచేయలేకపోయాడు విశ్వపతి. ముందూ వెనకాకూడా ఆలోచించకుండా లోపలకి మణి మంచందగ్గరకి పరిగెత్తాడు. మణి కళ్లుమూసుకుని పడుకునివుంది.

"మణీ!" అని పిలిచాడు మృదువుగా.

మణి పలుకలేదు. మంచంమీద కూర్చుని ఆమె వంటిమీద చెయ్యివేసి చూశాడు. సలసలకాగి పోతూంది.

(సశేషం)

# విండర్ మియర్‌సతి విసనకర్ర

రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

విం.ప్ర:-మార్గరెట్, నువ్వు అటువంటిపని చెయ్యబోకుసుమా.

విం.స:-నాసంగతి మీకు తెలీదు ('ఆర్' వైపు కదులుతుంది.)

[పార్కర్ ప్రవేశం]

పార్కర్ !

పా:-చిత్తం, అమ్మగారూ.

విం.స:-నేను నాగదిలోనే భోంచేస్తాను. నిజానికి నాకు భోంచెయ్యాలని లేదు. వదిన్నరకల్లా అంతా సిద్ధంగాఉంచు. ఈ రాత్రి రాబోయే అతిథుల పేర్లని స్పష్టంగా ఉచ్చరించు. నువ్వు ఒక్కొక్కసారి త్వరత్వరగా మాట్లాడుతున్నందువల్ల కొన్ని పేర్లని నేను గుర్తించలేకపోతూ ఉంటాను. ప్రతీ పేరూ ఇవేళ నేను స్పష్టంగా వినాలి, ఏమీ పొరపాటు జరగకూడదు, తెలిసిందా ?

పా:-చిత్తమండీ, అమ్మగారూ.

విం.స:-సరేలే.

[పార్కర్ 'సి' గుండా నిష్క్రమిస్తాడు]

(విండర్‌మియర్ ప్రభువు నుద్దేశించి):-ఆర్థర్, అదిగాని ఇవేళ ఇక్కడికి వచ్చిందంటే - ముందే చెబుతున్నా——

విం.ప్ర:-మార్గరెట్, మనని అపఖ్యాతికి పాలుచెయ్యకు.

విం.స:-మనమా ! ఈ తరుణంనుండి మన జీవితాలు వేరువేరై పోయాయని తెలుసుకోండి. మీరు లోకనిందకి భయపడేలాగుంటే, అది ఇక్కడికి రావడం నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేదని దానికి తక్షణం ఒక ఉత్తరం రాయండి.

విం.ప్ర:-నేను రాయను - రాయలేను - ఆవిడ రావలసిందే.

విం.స:-అలాగైతే నేను ఇదివరకు చెప్పినట్లే 'తుచ' తప్పకుండా చేస్తాను. ('ఆర్' తలుపువైపు వెళుతుంది) నాకు అంతకంటె గత్యంతరమేదీ లేదు.

['ఆర్' గుండా వెళ్ళిపోతుంది]

విం ప్ర:-(ఆమెను పిలుస్తూ) మార్గరెట్ ! (కొంతసేపు ఆగి) భగవంతుడా ! నా

కేదిత్రోవ? ఆ స్త్రీ అసలు ఎవరో నేను ఈమెకి చెప్పలేను. సంగతి విన్న దంటే అవమానాన్ని భరించలేక ప్రాణాల్ని విడవవచ్చును. (కుర్చీలో కూలబడి, రెండు చేతుల్లోనూ తన ముఖాన్ని దాచుకుంటాడు.)

అంకం సమాప్తి.

రెండో అంకం

విండర్‌మియర్ ప్రభువు భవనంలో అతిథులగది. బాల్‌రూమ్‌లో బ్యాండు వాయిస్తూ ఉంటారు. ఆర్. యూ. అనే ద్వారం బాల్ రూములోకి తెరవబడి ఉంటుంది. ఎల్ ద్వారంగుండా అతిథులు ప్రవేశిస్తారు. ఎల్. యు ద్వారం దీపాలతో విరాజిల్లుతున్న డాబావైపు తెరవబడి ఉంటుంది. కుండీలలో మొక్కలు, పువ్వులు, రకరకాలైన దీపాలు అమర్చబడి ఉంటాయి. గదినిండా అతిథులు కిటకిటలాడుతూ ఉంటారు. విండర్‌మియర్ సతి అతిథుల్ని ఆహ్వానిస్తూ ఉంటుంది.

బెర్రిక్ రాణి:-(ప్రవేశిస్తూ) విండర్‌మియర్ ప్రభువు ఇక్కడ లేరేమి చెప్మా, హాప్పర్ గారుకూడా ఇంకా రాలేదు. అగాతా, నువ్వాయనతో అయిదుసార్లు డ్యాన్సు చెయ్యడానికి నిశ్చయించేవుకదూ.

[ముందుకువస్తూ]

అగాతాకుమారి:-అవునమ్మా.

బె.రా:-(సోఫామీద కూర్చుంటూ) ఏదీ నీ కార్డు చూడనియ్యి. విండర్‌మియర్ సతి ఈ కార్డుల పద్ధతి మళ్లా ప్రవేశపెట్టడం అత్యంత ముదావహం. వాటి వల్లే పిల్లల ప్రవర్తన సరిదిద్దగలం. ఇదిగో చూశావా అమ్మాయీ (రెండు పేరుల్ని కొట్టేస్తూ) బొత్తిగా అలాంటి చిన్న కుర్రవాళ్లతో ఏ మర్యాదగల పిల్లా డ్యాన్సు చెయ్యకూడదు! అది అవినీతికి దారి తీస్తుంది. ఆఖరి రెండు డ్యాన్సులూ హాప్పరుగారితో డాబామీద కానియ్యి.

[డంబీష్లిండేల్ సతి బాల్ రూమునుండి ప్రవేశం]

అ.కు:-ఎందుకమ్మా.

బె.రా:-(విసురుకుంటూ) అక్కడ బాగా గాలి వస్తున్నట్లుంది.

పా:-మిసెస్ కూపర్ - కూపర్. స్టట్‌ఫీల్డ్ సతి, సర్ జేమ్స్ రాయ్‌స్టన్, గై బెర్క్లీ గారు ఈ వ్యక్తులు పేర్లు చెప్పిన వరుస ప్రకారం ప్రవేశిస్తారు.

డంబీ:-స్టట్‌ఫీల్డ్ సతిగారూ నమస్కారం. ఈ సీజన్‌కి ఇదే ఆఖరిబాల్ అనుకుంటాను.

స్టట్‌ఫీల్డ్ సతి:-నాకూ అలాగే తోస్తుంది డంబీగారూ. ఈ సీజన్ చాలా హాయిగానే గడిచిపోయిందికదూ?

డంబీ:-చాలా ఖుషీగా రాణీగారూ నమస్కారం. ఈ సీజన్‌కి ఇదే ఆఖరిబాల్ అనుకుంటాను.

బె.రా:-నాకూ అలాగే తోస్తుంది డంబీగారూ. ఈ సీజన్ చాలా చప్పగా గడిచిపోయిందికదూ ?

డంబీ:-చెప్పలేనంత చప్పగా గడిచిపోయింది.

మిసిస్ కూపర్-కూపర్:-డంబీగారూ నమస్కారం. ఈ సీజన్‌కి ఇదే ఆఖరిబాల్ అనుకుంటాను.

డంబీ:-అబ్బే, నాకు అలాగ తోచడంలేదు. బహుశా ఇంకా రెండుండవచ్చు.

[ప్లిండేల్ సతివైపు తిరిగి వస్తాడు]

పా:-రప్ఫోర్డ్ గారూ, జెడ్‌బరోసతి. మిస్ గ్రహం. హాప్పర్ గారూ.

[వాళ్లంతా క్రమప్రకారం ప్రవేశిస్తారు]

హాప్పర్:-విండర్ మియర్ సతిగారూ, ఖులాసాగా ఉన్నారా? రాణీగారు క్షేమమేనా?

[అగాతా కుమారివైపు తల పంకిస్తాడు]

బె.రా:-హాప్పర్ గారు ఇంత త్వరగా రావడం చాలా సంతోషించవలసిన విషయం. ఈ లండనులో ఏ వ్యక్తి చూచినా మిమ్మల్నే వెదకడం, రోజూ చూస్తూనే ఉన్నాం.

హా:-లండన్ భలే ప్రదేశంలెండి! సిడ్నీలో లాగ కాకుండా ఇక్కడి జనం ఖులాసాగా స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటారు.

బె.రా:-ఆహా, మీ ఘనత మాకు తెలియక పోదు హాప్పర్‌గారూ. మీలాటివాళ్లు ఇంకా కొంతమంది ఉంటే ఎంత బాగుంటుంది. దానివల్ల జీవితం ఎంతో సుఖవంతమయ్యేది. అగాతాకీ నాకూ ఆస్ట్రేలియా అంటే ఎంత యిష్టం అనుకున్నారు! కంగారూలు వరుగెత్తుతూ ఉంటే ఎంతో తమాషాగా ఉండాలి. అగాతా దానిని మేప్‌మీద కనిపెట్టింది. బలే ఆకారం! పెద్దసందుకా పెట్టెలాగుంది. అయినా దానిని ఇప్పుడిప్పుడే కనిపెట్టరుకదూ?

హా: తక్కిన ప్రదేశాలు ఏర్పాటైనప్పుడే అదీ ఏర్పాటైందికదూ?

బె.రా:-అబ్బా మీరెంత తెలివైనవారండీ మీ తెలివితేటలలో ఓ విధమైన వ్యక్తిత్వమున్నది. మిమ్మల్ని అనవసరంగా ఆపడం న్యాయంకాదు.

హా:-కాని రాణీగారు, నేను అగాతా కుమారితో డ్యాన్సు చెయ్యవచ్చా?

బె.రా:-అవును, ఆమె ఇంకా ఒక డ్యాన్సు చెయ్యాలికాబోలు. అగాతా ఇంకా ఒక డ్యాన్సు ఉందికదూ?

అ.కు:-అవును, అమ్మా.

బె.రా:-వచ్చేడ్యాన్సేకదూ?

అ.కు:-అవును, అమ్మా.

హా:-నేను మీతో డ్యాన్సు చెయ్యడానికి అనుమతిస్తారా?

[అగాతాకుమారి శిరం పంకిస్తుంది]

బె.రా:-అయితే ఒకటి అది అతివాగుడు వాగుతుందినుమా, హోప్పర్‌గారూ.

అగాతాకుమారి, హోప్పర్ బాల్‌రూమ్‌లోకి వెళ్ళిపోతారు.

[విండర్‌మియర్ ప్రభువు ప్రవేశం]

విం.ప్ర:-మార్గరెట్, నీతో మాట్లాడాలి.

విం స:-ఇదిగో ఓ నిమిషంలో వస్తా.

[సంగీతం ఆగుతుంది]

పా:-అగస్టస్‌లార్టన్ ప్రభువు.

[అగస్టస్‌లార్టన్ ప్రభువు ప్రవేశిస్తాడు]

అగస్టస్‌లార్టన్ ప్రభువు:-నమస్కారమండి విండర్‌మియర్ సతిగారూ.

బె.రా:-సర్ జేమ్స్! మీరు నన్ను బాల్‌రూమ్‌లోకి తీసుకువెడతారా? అగస్టస్ గారు ఇప్పటివరకూ మాతో నే భోంచేస్తూవున్నారు. అందుచేత ఇప్పుడు ఆయనంటే కొద్దిగా విసుగ్గాఉంది.

స.జే:-(బెర్రిక్ రాణికి తన చేతిని అందిచ్చి ఆమెని బాల్‌రూమ్‌లోకి తీసుకువెడతాడు.)

పా:-ఆర్థర్‌బౌడన్ దంపతులు పెయ్లీ పెయ్లీసతి, డార్లింగ్టన్ ప్రభువు.

[క్రమప్రకారం వాళ్లు ప్రవేశిస్తారు]

అ.ప్ర:-(విండర్‌మియర్ ప్రభువువైపు జరిగి,) ఏమోయి నీతో ముఖ్యంగా మాట్లాడాలి. బొత్తిగా నీరసంగా ఉంది. అయినా ముఖంలో అదేమీ కనబడదులే. లోపలెన్ని కష్టాలున్నా అవి బయటికి కనబడకపోవడం అనేది మన మగవాళ్ల సుకృతమే అనుకోవాలి. అదిసరేగాని ఆవిడ ఎవరోయి? ఏ వూరు? బంధువులెవరూ లేరే? బంధువులెవ్వరూ లేకపోవడం పోయి అయినప్పటికీ, వాళ్లు లేకపోతే లోకం మనని అంతగా గౌరవించదు.

వి.ప్ర:-మిసెస్ ఎర్లిన్‌ని గురించేనా నువ్వు మాట్లాడేది? ఆరునెలల క్రితమే ఆవిడని నేను కలిసేను. అంతకుముందు ఆవిడెవరో నాకు తెలీదు.

అ.ప్ర:-అప్పడినుండి ఆవిడతో తెగతిరుగుతున్నట్లున్నావే.

విం.ప్ర:-(నిరుత్సాహంతో) అవును. ఆవిడిని చాలాసార్లు కలిసేను. ఆవిడిని ఊరికే కలిసేను.

అ.ప్ర:-అబ్బా, ఈ స్త్రీలు ఆవిడమీద తెగవిరుచుకుపడుతున్నారుగదా. ఈ సాయంత్రం ఆరబెల్లా ఇంట్లో భోంచే

నేను. ఓహో, మిసెస్ ఎర్లిన్‌ని గురించి ఆవిడేమిటంది అనుకున్నావు. ఆవిడ ఒంటిమీద బొత్తిగా బట్టలేకుండా చేసేసింది అనుకో .... (చాటుగా) ఆమె చక్కని అంగసౌష్టవంకలది కాబట్టి అందువల్ల ఏమీ ప్రమాదం సంభవించదని బెర్రిక్కూ నేనూ ఆవిడతో చెప్పేములే. అప్పుడు ఆరబెల్లాముఖం చూడాలి! సరేగాని ఏమోయి ఈ మిసెస్ ఎర్లిన్ సంగతి ఏమిచెయ్యడమో నాకు పాలుపోవడంలేదు. నిజంగా ఆవిడని పెళ్ళాడాలనిపిస్తుంది; అయినా ఆవిడ నాతో అంత చప్పగా ఉంటుందేం? చాలా తెలివైంది. నీ ప్రవర్తనకి కారణం ఆమె విశదీకరించి చెబుతుంది. చక్కగా విడమర్చి చెబుతుంది.

విం.ప్ర:-నాకూ ఆమెకూగల స్నేహానికిగల కారణాల్ని గురించి చెప్పవలసిన అవసరంలేదు.

అ.ప్ర: ఇదిగో, సరేకాని, ఆవిడ మళ్ళా ఈ సంఘంలో తిరగగలదంటావా? ఆవిణ్ణి నీ భార్యకి పరిచయపరుస్తావా? చల్లకువచ్చి ముంత దాచడంవల్ల ఏమీ ప్రయోజనంలేదు. సరే అది చేస్తావా?

విం.ప్ర:-ఇప్పుడు మిసెస్ ఎర్లిన్ ఇక్కడికి వస్తుంది.

అ.ప్ర:-నీ భార్య ఆవిడకి కార్డు పంపిందా?

విం.ప్ర:-మిసెస్ ఎర్లిన్‌కి కార్డు అందింది.

అ.ప్ర:-ఆవిడ లోకమర్యాదని పాటించిందన్నమాట. ఆ సంగతి నాకు నువ్వు ముందే ఎందుకు చెప్పలేదు? అందువల్ల అభిప్రాయభేదాలూ మనస్సంకటాలూ లేకుండా ఉండేవిగదా.

[అగాథా కుమారి, హాప్పర్ ఎల్. యూ ద్వారంగుండా డాబాపైకి వెడతారు.]

పా:-సిసీల్ గ్రహంగారు!

[సిసీల్ గ్రహం ప్రవేశిస్తాడు]

(విండర్ మియర్ సతికి నమస్కారంచేసి, ముందుకువెళ్ళి విండర్ మియర్ ప్రభువు కరస్పర్శ చేస్తాడు.) కులాసాయేనా ఆర్థర్. నా క్షేమాన్ని గురించి మీరడగరేం? అందువల్ల మీకు నాపట్లగలవాత్సల్యం విశదపడుతుంది. ఏమో ఇవేళ నాకేమీ బాగాలేదు. మావాళ్ళతో భోంచేస్తూ ఉన్నా. మనవాళ్ళతో ఉంటే ఏమీ అంత ఉత్సాహంగా ఉండదు. భోజనంకాగానే మానాన్నగారు నీతినియమాల్ని గురించి మాట్లాడతారు. వయస్సు ముదిరేకొద్దీ జ్ఞానం అభివృద్ధి చెందేందుకు బదులుగా అసలుఉన్న కాస్తజ్ఞానమూ ఊడిపోతుంది. ఏమోయి టప్పీ! నీకు మళ్ళా పెళ్ళి జరగబోతుందని విన్నాను; పెళ్ళంటే నీకు విసుగెత్తలేదన్నమాట.

అ.ప్ర:-అబ్బా నువ్వు తెగవాగుతావోయి, ఏమి వాగుడు !

సిసీల్ గ్రహాం:-సరేగాని టప్పీ అసలు సంగతేమిటి ? రెండుసార్లు పెళ్ళాడి ఒకసారి విడాకులిచ్చావా, లేకపోతే రెండుసార్లు విడాకులిచ్చి ఒకసారి పెళ్ళాడేవా? రెండుసార్లు విడాకులిచ్చి ఒకసారి పెళ్లాడేవని నేను అంటున్నాను. అదే సంభవంగా తోస్తున్నది.

అ.ప్ర:-నాకు జ్ఞాపకశక్తి తక్కువ, ఏదో నాకు జ్ఞాపకంలేదు.

[అక్కడనుండి కదుల్తాడు]

స్లింగ్‌డేల్ సతి:-విండర్‌మియర్ ప్రభూ, నేను మిమ్మల్ని ముఖ్య విషయం అడగాలి.

వి.ప్ర:-క్షమించండి, మా ఆవిడిని కలుసుకోవాలి.

స్లిం.స:-అటువంటి సంగతుల్ని మీరు తలపెట్టకూడదు. బహిరంగంగా భార్య వెంబడి తిరుగుతూ ఉండడం భర్తకంత శ్రేయస్కరమైనది కాదు. అందువల్ల ఒంటరిగా ఉన్నప్పుడు అతడామెను కొడుతూ ఉంటాడని అంతా అనుకుంటారు. భార్యా భర్తలు కులాసాగా తిరగడంచూచి లోకం హర్షించదు. భోంచేసేటప్పుడు అసలు సంగతి చెబుతా.

[బాల్‌రూమ్‌గది వైపుకి జరుగుతుంది]

వి.ప్ర:-(ఇంకోవైపునున్న ఆమెనుద్దేశించి) మార్గరెట్, నేను నీతో కాస్త మాట్లాడాలి.

విం.స:-హార్లింగ్టన్ ప్రభూ ఈ విసనకర్ర దయచేసికాస్త పట్టుకుంటారా? ధన్యవాదాలు.

[అతనివైపు వస్తుంది]

విం.ప్ర:-(ఆమెవైపు వెళ్లి) మార్గరెట్ నవ్వేందాక అన్నట్లుగా మాత్రం చెయ్యబోకుసుమా.

(సశేషం)

# డాక్టర్. కే. యస్. కేసరిగారి నిర్యాణంపట్ల

## సంతాప పరంపరలు

డా॥ కే. యస్. కేసరి మహాశయుల మరణవార్త వినిన వెంటనే వారి జీవితమంతయు మనస్సును కలచినది- సంతాపము జనించినను సంతోషముకూడ నందిమిడి యున్నది. జనసాధారణమగు మృతినొంది భౌతిక శరీరము వీడినారేయను సంతాపమును, దానితోపాటు సార్థక జీవులై మృతినొందియు కీర్తికాయులైనారు కదాయను సంతోషమును ఒకేసారి జనించినవి- చదువువారు చెప్పలేరు - మాటలు చెప్పువారు చేయజాలరు, చెప్పినదానిని చేసి చూపిన ఆదర్శమూర్తి. వారి జీవిత చరిత్ర రూపముగ నుండ తగినదేకాని వారి జీవితమందలి దానదయా ఔదార్య సుగుణాదులు వినవలసిన నక్కరయేలేదు. అది కొద్దోగొప్పో సర్వజనులు అనుభవించినదే అయినను ఒక్కొక్క మూలపురుషుడు ద్భవించుటయు, కీర్తికాయులగుటయు వింతకాదు. ఎన్నోవిన్నాము, ఎందరినో చూచాముకాని ఇన్ని సంస్థలు, ఇన్ని విద్యాలయములు ఇన్ని దానధర్మములు, ఎన్నుటకుమించినట్టి సత్కార్యములు చేసి జీవిత చరిత్రమంతయు పుణ్యకార్యములు చేసి అగర్భ శ్రీమంతులై, అతినిగర్వియైన డాక్టరు కేసరిగారీ నెల 8-6-53 న ఉదయం 7 గంటలకు స్వర్గసీమ నలంకరించిరని వినుట నాకెంతో బాధ కలిగించినది. వారు ధన్య జీవులేకాని పేద విద్యార్థులు, కుటుంబినులు, దేశము మాత్రము దురదృష్టవంతము. భగవానుడొసంగిన ఆయుష్కాలమును సద్వినియోగము చేసి సద్భక్తులైన శ్రీ వారి ఆత్మ సర్వోన్నతి నొందినది. వారిని చూచి వారి సత్కృతులు, దానదయాది గుణశీలముల నలవరచుకొని వారియడుగు జాడలలో ఆంధ్ర సోదరులు మెలగవలని యుండుట ఎల్లరు గమనించదగిన విషయము. ముఖ్యంగా వారి మరణవార్త విని విచారించిన నా కొక విషయం స్ఫురించినది.

> జరయు, మృతియు లేని జనరట్లు ప్రాజ్ఞుండు
> ధనము విద్యగూర్పc దలపవలయు
> ధర్మమాచరింపదగు మృత్యుదేవత
> తలపట్టి యీడ్వబడినవాడుపోలె.

అన్న భారతనీతి నాచరణలో చూపిన మహామహుల పట్ల చెప్పవలసిన దేమున్నది. సూర్యుని కాగడచే చూపించినట్లుండును. ఆంధ్రసోదరుని మృతికి విచారించు ఆంధ్రులకు వారి ఆదర్శమును జ్ఞప్తికిదెచ్చి, పరమేశ్వర సాన్నిధ్యమున వారి పరమాత్మ జ్యోతివలె ప్రకాశించుచు చరిత్ర మాచంద్రార్కము నిలుచుగాకయని ప్రార్థించుచున్నాను ఈ సత్కీర్తి ఇలనెందాకనుండు అందాక స్వర్గసౌఖ్యములా జీవి చెందునని మన హిందూధర్మ సిద్ధాంతము. ఇకవారికి ఇహ పరములు రెండును దక్కినవని నా నమ్మకము.

కానుకొల్లు చంద్రమతి, మద్రాసు.

◆ ◆ ◆ ◆

పితృ సమానులయిన శ్రీ॥ కేసరి మహాశయుని, మరణము ఆంధ్ర నారీలోకమునకు తీరని దుఃఖము కొఱత, కలిగినదని చెప్పుట నవసరము.

వారు శ్రమపడి, స్వయముగ, సంపాదించిన సొమ్ము దానధర్మములకు, చెన్నపట్టణములో తెలుగు బడులులేక కష్టపడుచుండిన సమయమున, రెండు పాఠశాలలు స్థాపించి, స్త్రీల ఆరోగ్యము కాపాడుటకు,

ఆంధ్ర మొదలగు మందులు, విజ్ఞానము కలుగుటకు, స్త్రీలకు ప్రత్యేక మాసపత్రికను ప్రచురించుచుండిరి. ఏమి తెలియని వారికికూడా వ్రాయవలెనన్న ఉత్సాహము, ప్రోత్సాహము కలిగించెను. ఇట్లు వారి రచనలను అభివృద్ధి పరచిరి.

స్త్రీలకు అన్ని కళలయందును, అభిరుచి కలుగుటకు వారిలో ఉత్తములకు ఏటేటా, స్వర్ణకంకణ బహుమానము నేర్పరచిరి. ఇదివరకు ఎవరును చేయని ఈ మహత్కార్యము నీ మహనీయుడు చేయకల్గెను.

భగవానుడు వారి ఆత్మకు శాంతినిచ్చుగాక.

నెమలి చంద్రమతి.

♦ ♦ ♦ ♦

ది 24-7-53 న బాపట్లయందు స్త్రీ హితైషిణి మండలి యాజమాన్యమున శ్రీ కేసరిగారి స్మారక సభజరిగెను. శ్రీ కేసరిగారి జీవిత విశేషములను గురించి 'శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఉపన్యసించిరి. అనంతరము యీ క్రింది సంతాపతీర్మానము ఆమోదించబడెను:

'గృహలక్ష్మి' పత్రికను స్థాపించియు, పోటీపరీక్షలేర్పరచియు, మద్రాసు నందు తెలుగు బాలబాలికల అభ్యుదయము నిమిత్తము విద్యాసంస్థలేర్పరచియు, స్త్రీలకు గృహలక్ష్మి స్వర్ణకంకణ సత్కారము లేర్పరచియు, ఆంధ్ర మహిళాభ్యుదయమునకు విశేషకృషి యొనర్చిన శ్రీ కేసరిగారి మరణమునకు యీ సభవారు తమ సంతాపమును వెలిబుచ్చుచు వారి ఆత్మశాంతికి భగవంతుని ప్రార్థిస్తున్నారు.

♦ ♦ ♦ ♦

ఈ లోకములో యెవరు కన్నబిడ్డలను వారు ఉన్నతస్థితికి తెచ్చుటె కష్టము. అట్టి పరిస్థితిలో కేసరిగారు స్త్రీ లోకమంతయు తన కన్న బిడ్డలవలే ఆదరించి అన్ని విషయములలోను స్త్రీలను ఉన్నతస్థితికి తెచ్చుటకు తన స్వయం కృషివల్ల ఆర్జించిన ధనము వెచ్చించి స్త్రీలను అన్ని విధముల ప్రోత్సహించి ఆదరించిన ధన్యజీవి. వారి భౌతిక దేహము అంతరించినదేగాని వారిజీవితచరిత్ర ధృవతారవలె ఆచంద్రార్కంగా మనకన్నులఎదుట ప్రతిక్షణము చూచుకొనుచున్న గృహలక్ష్మియే మనకు నిదర్శనము. ఇట్టి పితృతుల్యులగు శ్రీ కేసరిగారి ఆత్మకు శాంతి కలుగుగాకయని ప్రార్థన.

పులిపాక బాలాత్రిపుర సుందరమ్మ, బాపట్ల

♦ ♦ ♦ ♦

I recall to my mind the early days of Dr. Kesari's career and the time I was spending with him. His is a notable career in the whole of Andhra and it will remain in the minds of all for a long time.

V. Rajagopal, Nellore

# శ్రీమతి రసీల్ బాసు

న్యూయార్కు నగరంలో ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యాలయంలో వివిధ దేశాల స్త్రీ పురుషులు 3000 మంది ఉద్యోగాలు చేస్తున్నారు. వీరు అంతర్జాతీయ సమితిద్వారా ప్రపంచసేవచేయ సంకల్పించుకొనినవారు.

వీరిలో ఐక్యరాజ్యసమితి మహిళల హక్కుల రక్షణ సంఘంలో పనిచేస్తున్న శ్రీమతి రసీల్ బాసుపాత్ర అత్యంత ప్రధానమైనదిగానున్నది.

ఆమె స్వస్థలము కలకత్తా. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో యం. ఎ. 'లా' పరీక్షల యందు తీర్ణురాలయి న్యూయార్కులో ఒక సంవత్సరము చదివి 'లా' డిగ్రీ పొందారు.

1948 సం॥ము ఐక్యరాజ్యసమితి కార్యకలాపములను తెలియజెయ్యడానికి రెండు నెలలపాటు ఏర్పాటుచేయబడిన శిక్షణ తరగతులలో పాల్గొనడానికి ఆమెను ఇండియా ప్రభుత్వము న్యూయార్కుకు పంపింది. ఆ తర్వాత సమితి కార్యాలయంలో ఆమెకు ఉద్యోగము లభించింది.

ఆమె, ఆమెభర్త సమితి కార్యాలయంలోనే పనిచేస్తున్నారు.

రానున్న 1954 సం॥పు సమితి స్త్రీల హక్కుల సమావేశానికి శ్రీమతి బాసుగారు విషయాలను సేకరిస్తున్నారు. వివిధ దేశాలలోని మహిళా సంఘాలు సాగిస్తున్న కార్యకలాపాలు, వాటికి సంబంధించిన నివేదికలను అత్యంత శ్రద్ధతో పరిశీలిస్తున్నది.

మహిళాభ్యుదయము యెడల ఆమెకుగల ఆసక్తికొద్దీ పరిశీలనా ఫలితంగా ఓటింగు, ఉద్యోగసదుపాయాలు, విద్యా సౌకర్యాలు, ఆస్తిపై హక్కులు మొదలగువానిలో స్త్రీల పట్ల విచక్షణ తగదనియు, దానిని తొలగించడంవలన సంఘానికి మేలుచేకూరగలదని ఆమె అభిప్రాయము. అమెరికాలోని 48 రాష్ట్రములలో 38 రాష్ట్రములందు పర్యటించి 'ముందంజవేసిన అమెరికాలో సయితం కొన్ని రాష్ట్రములు మాత్రమే పురుషులతో బాటు స్త్రీలకు సమానంగా జీతాలివ్వాలని శాసనాలు చేశాయనియు, కొన్ని రాష్ట్రాలలో స్త్రీల కట్టి రక్షణలు లేవ'ని అభిప్రాయమును వెల్లడించారు.

---

పాశ్చాత్య వైద్య విధానంలో పరిశోధనలు బహుముఖంగా జరుగుతున్నవి. అంతగా ఆయుర్వేద వైద్యంలో జరుగకపోయినాకొద్దీ, గొప్పగా దానిలో పరిశోధనా ఫలితంగా ఉన్మాదానికి మొదలైన మనోవ్యాధులకు అహమ్మదాబాద్ నగరంలో ప్రభుత్వ ఉన్మాద వైద్యశాలలోని డా. ఆర్. టి. హకీం గారు తిప్పతీగె, వస, గుంటకలగరలతో మాత్రలను కనిపెట్టారట.

ఈ మందు వాడకంవలన అత్యంత తృప్తికరమైన ఫలితములు సమకూరుతున్నవట. ఈ మాత్రలతో బాటు విద్యుత్ చికిత్సజోడించి చేసినవారికి 100-కి 80 మందికి వ్యాధి నివారణ జరిగినదట.

# వంటయింటి సౌకర్యాలు

శ్రీమతి సి. లక్ష్మీపున్నయ్య

మానవుడి ప్రధానవసరములలో ఆహారము ఎట్లు ముఖ్యమైనదియో దానిని తయారుచేయు వంటయిల్లుకూడ గృహములో అంత ప్రధానమయిన భాగము.

తమ తమ ఆర్థిక స్థిమితాన్నిబట్టి ఉన్నంతలో పద్ధతిగా, శుభ్రంగా, కిటికీలతోటి పొగ బయటికి పోయే అవకాశములతోటి వంటయింటిని అమర్చుకొనుటవలన వంటచేసేవారికి అంతగా శ్రమ అనిపించదు.

వంటకుపకరించే పాత్ర సామగ్రి, ప్రతిదినము అవసరమైన ఆహారపదార్థములను నియమిత స్థానములలో అట్లునిటు మెసలడానికి అడ్డములేకుండా నుంచుకోవాలి. అందుకని అరలబీరువాలను చేయించుకొని గోడలకు తగిలించి అందులో గుర్తుగా పైసామానులను సర్దియుంచుకొనుటవలన వంటయింట్లో విశాలమేర్పడుతుంది; కావలసిన వస్తువులు సునాయాసంగా శీఘ్రకాలంలో లభిస్తవి; పైగా ఆహారపదార్థములు పిల్లులకు, ఎలుకలకు, పసిపాపలకు అందుబాటులో నుండకుండాయుంటవి.

ముందుగా వారమునకుగాని, పదిహేను రోజులకుగాని సరిపోయే సామానులు ఒకసారి తెప్పించుకొని రాళ్లు, రప్పలు ఏరి బాగుచేయవలసిన వానిని చేసి దేనికది ప్రత్యేకముగా మూతలుగల డబ్బాలలోగాని, పాత్రలలోగాని, జాడీలలోగాని నిలవచేసికొనవలెను.

పప్పుదినుసులను డబ్బాలలోపోసి యుంచుకొనేటయినచో గుర్తుగా ఏదినుసుకు ఆ దినుసు పేరుగల చీటీలు అంటించుకొనినచో కావలసిన దానికి వెదకుకొనుట తప్పిపోతుంది.

పాలు, నెయ్యి జాడీలలోగాని, కళాయిగల పాత్రలలోగాని యుంచుకొని మూతలు ఏమరకుండా యుంచుకోవాలి.

మిరపకాయలు, ఆవాలు, జీలకర్ర, మెంతులు మొదలగు చిల్లర సామగ్రిని చిన్నచిన్న గాజు సీసాలలోపోసి యుంచుకొనినచో వానిలోని వస్తువులు పైకి కనుపిస్తుంటవి కాబట్టి కావలసిన వానిని వెంట వెంటనే తీసికొనుచుండవచ్చును.

గాజు సీసాలలో నుంచుకొనుట కవకాశమున్న సామానులన్నిటికి వానిని మూతలతో సమకూర్చుకొనినచో చీమలకు, పురుగులకు అందుబాటులో నుండకపోవడమే కాక వంట శీఘ్రముగాను, తక్కువ శ్రమతోటి తయారగును.

ఊరగాయలు, పచ్చళ్లు సాధారణంగా జాడీలలో నుంచుటయే మేలు. మట్టిపాత్రలలో పెట్టుటవలన ఊట త్వరగా ఆరిపోయి ఊరగాయలు, పచ్చళ్లు ఎండి వసుగురూపం ఏర్పడుతుంది.

పై సామానులన్నిటిని అరలబీరువాలలో గుర్తుగా సర్దుకొనిన వంటయింట్లో గజిబిజిగానుండక శుభ్రముగానుండును.

ఇక పొయ్యిలమర్చుకోడంలో తగుశ్రద్ధ వహించాలి ఆడవారు, మగవారుకూడ వంగికాని, కూర్చొనికాని వంట చేసేదానికంటె నిలబడి వంట చేయడం సౌకర్యముగా నుండును. అందుకుగాను అనువుగా ఎత్తుగా అరుగు వేయించుకొని దానిమీద పొయ్యిలుంచుకొని వంట చేసికొనవచ్చును. అరుగు క్రింద గూళ్లున్నచో వంటపాత్ర సామాను, బొగ్గులు కాని, కట్టెలు కాని కొద్ది కొద్దిగా నుంచుకొని వాడుకొనుచుండవచ్చును.

పొయ్యిలుగాని, కుంపట్లుగాని ఎత్తైన అరుగుల మీదనుంచి వంటచేయుటవలన యింట్లో పసిపాపలకు అగ్ని ప్రమాదములుకూడ సంభవించవు.

వండిన వంటకాలు, పిండివంటలు, నెయ్యి, పాలు మజ్జిగ మొదలగునవి ఈగలు, దోమలు వాలకుండాను, చీమలకు, పిల్లులకు, ఎలుకలకు అందుబాటులో నుండనట్లు భద్రపరచుకొనుటకు వంట యింట్లో ఏర్పాటు చేసికొనవలెను.

గచ్చుచేసిన వంటయిల్లు అయినచో పరిశుభ్రముగా నుంచుకొనుటకు కడిగిననీరు బయటికిపోవుట కనుకూలంగా తూములుండవలెను. వంటకు కావలసిన మంచినీటి వసతులు సమీపంలో నుండుటవలన వంటచేసేవారికి శ్రమ చాల తగ్గును.








## నల్లేరు చట్నీ

నల్లేరు సర్వసాధారణముగా లభించునట్టిది, అందులో తాటిచెట్టుకు ఎగబ్రాకియుండునది శ్రేష్ఠమైనదని వాడుక. నల్లేరును చిన్నముక్కలుగా తరిగి నూనెలో వేయించుకొని యుంచవలెను. నూవులు, పచ్చిమిరపకాయలు, తెల్ల ఉల్లిపాయరెబ్బలుకూడ నూనెలో వేయించుకొని నల్లేరుముక్కలతోబాటు రోటనుంచి అందులో ఉప్పు, కొద్దిగా పసుపుపొడి, చింతపండుపులుసువేసి మెత్తగా ముద్దయగునట్లు రుబ్బుకొని అన్నసాధకముగా వాడుకొనవచ్చును.

## కందిదోశ

ఒకపడి బియ్యములో దానిలో మూడవవంతు కందిపప్పు కలిపి బరకబరకగా విసిరియుంచుకొనవలెను. అందులో తగుమాత్రంగా మిరియాలు, జీలకర, నూరివెయ్యాలి. ఒకటెంకాయ పచ్చికొబ్బరిని ముద్దగా నూరినదానినికూడ అందులో కలిపి తిరగపోతపెట్టి మొత్తాన్ని దోశపిండిరూపంగా కలిపి దోశలు పోసి భుజించినచో చాల రుచిగానుండును.

## కందిమాడ

కందిపప్పును బాగుచేసినప్పుడు నూక మిగులుటకలదు. దానిని లాభకరంగా వినియోగించుకోడానికి మార్గము—నూకను రాళ్లు, మట్టిలేకుండా బాగుచేసికొని నీళ్లలో నానపోసుకోవాలి. నానినతర్వాత వడియగట్టి రోటనుంచి అందులో తగినన్ని పచ్చిమిరపకాయలు, ఉప్పు, పసుపుపొడి, కొత్తిమేరాకు, ఒక టెంకాయ పచ్చికొబ్బరి మెత్తగా యిడ్లీపిండిలాగు రుబ్బకొని యిడ్లీపాత్రలో యిడ్లీలనుంచినట్లుంచి ఆవిరిచే ఉడికించి తీసి నెయ్యివేసుకొని తినినచో చాల రుచిగానుండును. ఈ కుడుములను నలిపి అందులో పెద్ద ఉల్లిపాయముక్కలతో తిరగపోత వేసినచో అన్నసాధకంగా నుపయోగపడును.

అల్లూరి సోదరి

## రాచఉసిరికాయలపచ్చడి

రాచవుసిరికాయల పచ్చడి చేయువిధానమునకు, శేరు వుసిరికాయలకి గిద్దఉప్పు, గిద్ద కారం, మెత్తగకొట్టి వుంచవలెను. 2 తులముల మెంతులు ఎర్రగా వేయించి, నాలుగు తులముల ఆవాలు, వేయించిన మెంతులు మెత్తగనూరివుంచవలెను. బాణలిలో ½ సవాశేరు నూనెపోసి కాగనిచ్చి మిరపకాయలు, ఆవాలు తాలింపుపెట్టి వుసిరికాయలు దానిలో వేసి కలియపెట్టి మూతపెట్టవలెను. మెత్తగ వుడికినతరువాత కారం ఉప్పు మెంతిపిండి ఆవపిండి దానిలో వేసి కలిపి కొంచెముసేపు పొయ్యిమీదవుంచి దించవలెను. ఇది తినుటకు చాలా రుచికరముగనుండును.

నాళం అలివేలుమంగతాయారమ్మ

## కంది, పెసరపప్పులతో పచ్చళ్లు

కందిపప్పును వేయించి అందులో తగుమాత్రంగా ఉప్పు, ఎండుమిరపకాయలు జీలకర వేసి రుబ్బి చేయడం ఒక విధం. జీలకర్రకు బదులుగా చిన్న ఉల్లిపాయ రెబ్బలనుగాని, చింతపండు పులుసునుగాని చేర్చి తయారుచేసికొనుట యితర విధములు. కందిపప్పు వేయించిన పాకమునుబట్టి సువాసనతోటి, రుచికరంగా నుంటుంది పచ్చడి. కావలసినవారు పచ్చికొబ్బరినికూడ కలిపి రుబ్బుకొని వాడుకొనినచో అదొక రుచిగా నుండును.

పైవిధంగానే పెసరపప్పును వేయించి అందులో తగుమాత్రంగా ఉప్పు, మిరపకాయలు, జీలకర వేసి రుబ్బుకొనినచో చక్కని అన్నసాధకమగును.

పచ్చిపెసర పప్పును నీళ్ళలో నానపోసి, నీళ్ళను వడియగట్టి రోటిలోనుంచి తగుమాత్రంగా ఉప్పు, ఎండుమిరపకాయలను, కొత్తిమీరాకునుకూడ వేసి కచ్చపచ్చగా రుబ్బి గిన్నెలో తోడవలెను. అందులో ఒక చిన్ననిమ్మకాయ రసమునుగాని, చింతపండు పులుసునుగాని కలిపి బాగా కలియబెట్టవలెను. కొత్తిమీరాకుకు బదులుగా ఇంగువపాలుకూడ పోయవచ్చును. తర్వాత తిరుగపోతపెట్టి పలచగా వాడినచో చాల రుచిగా నుండును.

పైమార్గాలకంటె సులభమార్గాన అతిశీఘ్రకాలంలో అప్పటికప్పుడు తయారుచేసికొనే పచ్చళ్లున్నవి. కందిపప్పునుగాని, పెసరపప్పునుగాని వేయించుకొని పొడిచేసి డబ్బాలలో నిల్వచేసికొని యుంచుకోవలెను. కావలసినప్పుడు ఆ పొడిని కొంచము గిన్నెలోకి తీసికొని అందులో కొంచము కారపుపొడి, ఉప్పువేసి సలసల కాగేనీరుపోసి ముద్దగా కలుపవలెను. అందులో జీలకర పొడినిగాని, ఇంగువపాలనుగాని, చింతపండు పులుసునుగాని కలిపి తిరుగపోతపెట్టి వాడినచో రుచిగానుండును.

(శ్రీమతి) సి. లక్ష్మీపున్నయ్య

—:o:—

## ఆణి ముత్యాలు

'జాతికి జీవం సంస్కృతి' — స్వామి వివేకానంద.

'బుద్ధుల్ని అనుసరించే పనులుంటాయి' — మహమ్మద్.

"శాంతి కావాలంటే ముందు యుద్ధానికి సిద్ధంగావుండు."

'గొప్పరచనలు గొప్పవాళ్ళని తయారుచెయ్యలేవు.
కాని గొప్పవాళ్లు గొప్ప రచనల్ని చేస్తారు'—లూథర్ మార్టిన్.

'సాహసంకూడ ప్రేమవంటిదే. ఆశవల్ల అదివృద్ధిచెందుతూ వుంటుంది'—నెపోలియన్.

గతించిన దాని గురించి నీవేమైనా తెలుచుకోదలచుకుంటే, నీకు సంతోషం కలిగించే అనుభవాల గురించి మాత్రమే తెలుచుకో' — జేన్ ఆస్టిన్.

'ఒక నదియొక్క మహా ప్రవాహాన్ని అడ్డటంకన్నకూడ, ప్రజలయొక్క వాక్ప్రవాహాన్ని అరికట్టడం మహా ప్రమాదం' — ఇంగ్లీషు సామెత.

'శ్రీసూర్య'



# స్త్రీ బుద్ధిః ప్రళయాంతక

శ్రీమతి శ్రీధర జయలక్ష్మి

అప్పట్లో డాక్టర్ జోగారావును ఎరుగనివారు ఆ గుంటూరు జిల్లాలో లేరు. ఇతని భార్య అన్నపూర్ణ. ఈవిడ కాపురానికి వచ్చిన 10 సం॥ములకు అందాల భరిణె "మీనా" పుట్టింది. పిల్లకు 10 ఏళ్లు వచ్చాయి కానీ! ఆ తరువాత అన్నపూర్ణకి కాన్పే లేకపోవడంచేత వంశానికి మొగ నలుసు లేకపోవడం ఈ దంపతుల్ని నానావిధాల తహతహలాడించి వేస్తున్నది. ఒకనాటి సంధ్య సమయం వాకింగ్ కెళ్లిన దంపతులు ఇలా ముచ్చటించుకొనుచూ పార్కులో సిమెంటు బెంచీమీద కూర్చున్నారు.

అన్నపూర్ణ:-"ఎన్నివున్నా మొగపిల్లాడు వుంటేనే! ఇహానికీ పరానికీకూడా సార్థకం. పిల్లను ఒకరిచేతిలో పెట్టాక తరువాత మన స్వతంత్రం ఏమున్నది"

జోగారావు:-"నిజమే నాకుమాత్రం లేదూ? నీవు ఆడమనిషివిగనుక ఇలా బైటికి వాపోతూవుంటావు. నేనూ అదే మనోవ్యాధినిపడి అహర్నిశలూ పరితపిస్తున్నాను."

అ:-"పోనీ ఎక్కడైనా మంచి కుటుంబంలో ఒకకుర్రాణ్ణి దత్తత చేసుకుందాం. చిన్న కుర్రాడైతే! కన్నప్రేమకంటే పెంచిన ప్రేమ ఎక్కువన్నట్టు అతికిపోతుంది."

జో:-"నీ వెర్రి! ఇతర కుర్రాళ్లు మనల్ని వృద్ధాప్యంలో ఆదరిస్తారటే! చక్కగా పెడితే తిని వున్నదేదో మూటకట్టుకు చక్కాపోతారు. మొగ ఆడ అంతా భగవంతుడు యిచ్చిన ఆ నలుసే మనకు. ఊర్కే ఎందుకు పరివిధాల మనస్సు పాడుచేసుకుంటావ్."

అ:-"ప్రపంచమున ఎందరు దత్తత తీసుకోవడంలేదు! తీసుకున్న వారంతా ఏమయ్యారు? ఎవరో ముక్కూ మొఖం ఎరుగనివాళ్లని తీసుకోకూడదుగాని ఎరిగున్న వారిలోనూ పదిమందిలో పుట్టిన బిడ్డణ్ణి తీసుకోవొచ్చునండీ!"

జో:-"కానీ చూద్దాం. ఏం భగవంతుడు అనుగ్రహించితే నీకే ఒక కొడుకు పుట్టొచ్చుగా."

అ:-"నందో రాజా భవిష్యతి. ఇంకా పుట్టడం ఏమిటండీ! 38 ఏళ్లు నాకు వచ్చాయా, సక్రమంగా వెలుపల వుండడంకూడా లేదాయెను. "ఫలంవుండి దేవుడు ఒడి కడితే వద్దంటామా!" కానీ, తప్పక

ఒక కుఱ్ఱవాణ్ణి చేరదీసుకొని ముద్దు ముచ్చట్లు తీర్చుకుంటామన్నది అన్న పూర్ణ."

జో:-"కానీ చూస్తాం! నీ కోర్కె ఎందుకు కాదనాలి! మా వూరికి వుత్తరం వ్రాసి కనుక్కుంటాను." అంటూ మెల్లగా ఇంటికి నడచారు. వీరి కుమార్తె మీన చక్కని చుక్క. రూపముతో అన్వయించిన తెలివితేటలుకల్గి అల్లారు ముద్దుగా వర్థిల్లుచున్న బాల. జోగా రావు పిల్లవాన్ని దత్తత తీసుకో నుద్దేశించినట్లువిని అనేకమంది 'మేమిస్తా మంటే మేము సిద్ధంగావున్నామన్నారు. ఎందుకివ్వరూ! గొప్ప ఆస్తి, మరి యాద గల వంశం, మంచి పేరు ప్రతిష్ఠలు గడించిన డాక్టరు జోగా రావు. ఆఖరికి వీరి బంధువర్గంలోనే ఒక 7 సం॥ ల కుఱ్ఱవాణ్ణి దత్తత చేసుకొన్నారు. కుఱ్ఱవాని పేరు "సూరి". సూరి చక్కగా గుమ్మడి పండులా ఎఱ్ఱగా, బొద్దుగా ముద్దొస్తూ వుంటాడు. ఇంటికి పిల్లాణ్ణి తెచ్చుకున్నప్పటినుండీ అన్నపూర్ణకి మీనకి సంతోషానికి పరిమితిలేదు. ఎప్పుడూ సూరిని తృప్తి పరచుటలోనూ, సూరికి మంచి దుస్తులు కుట్టించుటయందు వాడికి బుద్ధిమతులు గొల్పుటలో అన్నపూర్ణకి అహర్నిశలూ చాలకపోయాయి. సూరిని తెచ్చుకొని ఏడాది దాటింది. అప్పటికి ఏనాలుగుమార్లో కుఱ్ఱవాణ్ణి కన్నవారింటికి తీసుకుపోయి చూపి రావడం జరిగింది. కొత్తగా తెచ్చుకున్నాం కదా! అన్నట్టుగా అన్నపూర్ణ కుఱ్ఱవాణ్ణి ఒక్క మాట అనకుండా కోరినవల్లాచేస్తూ అరిచేతులో పెట్టుకొని సంరక్షిస్తూ వున్నది. జోగారావుకి మాత్రం భార్యను తృప్తిపరచడానికి ఈ పని చేశాడే కానీ! అతనిలో కించిత్తైనా కుఱ్ఱాడిమీద మమకారం వుద్భవించ లేదు. ఇక సూరి సంగతెలా వుందంటారా? సాక్షాత్తు మాతృమూర్తి వలె తన్ను ఆదరిస్తున్న తల్లిని ధిక్కరిస్తూ ఆవిడ ఏది చెప్పినా దానికి ప్రతిగా నడుస్తున్నాడు. బుజ్జగిస్తూ బుద్ధిమతులు చెప్పు మీనతోటి ఎప్పుడూ కయ్యమునకే సిద్ధంగా వుంటాడు. ఇంతకాలమైనా అమ్మా, నాన్నా, అక్కా, అన్న వరసపెట్టి వరాకునైనా నోరెత్తి పిలవ లేదువాడు. ప్రతిరోజూ ఒడినుండి చీకటిపడేదాక ఇంటికిరాడు. వచ్చే దారిలో కోడిపందేలు, గోలీగుండ్లూ, ఇలాంటి ఆటలయందు మక్కువకొద్దీ అచ్చటవుండి మెల్లగా ఇంటికి వచ్చేవాడు. ప్రతిరోజూ ఏదో ఒక ఫిర్యాదు సూరిపైన వూరివారువచ్చి చెప్పుచుంటే దత్తత తండ్రి వుగ్రుడై నాలుగు లెంపకాయలుపెడుతూ దండిం

చుచూ వుండేవాడు. అటువంటప్పుడు అన్నపూర్ణ కుమారుణ్ని వెనకేసుకొని వొచ్చి మధ్య తనుకూడా భర్తతోటి నిష్ఠూరపడుతూ వుండేది. ఇలాగే వీరి సంసారం సూరి వచ్చిన తరువాత ప్రతి రోజూ కయ్యాలతోటి దుర్భరంగా సాగుతూ వొచ్చింది. 8 సం॥ తరువాత ఒకనాటి 12 ఘం॥ల సమయం. అన్నపూర్ణ కంగారుగా ఇంట్లో బీరువాలు, పెట్టెలు, గూళ్లు అన్నీ ఏదో వస్తువుకోసం వెతుకుచూ వుంటుంది. భర్త ఆవిడ హడావడి చూచి "ఏమిటలా వెతుకుతున్నావ్ ?" అన్నాడు. "పొద్దున తలంటి పోసుకున్నప్పుడు నా చేతి రవ్వల వుంగరం బీరువాలో పెట్టాను కనుపించలేదు" అన్నది.

జో:-"కనుపించలేదూ? నీ ముద్దులకొడుకు నడక్కపోయావా?"

అ:-"అబ్బే! కుర్రవెధవ అంతపని చెయ్యడు లెండీ!"

జో:-"నీ నమ్మకమే నిన్ను చంపేస్తుంది. దారినిపోయే దరిద్రాన్ని అంటకట్టుకొని హతమైపోతున్నాం! ఖర్మ ఎవరు తప్పిస్తారు చెప్పు." అన్నపూర్ణ భర్త ఎదురాడి ఎరుగని సాధ్వి. ఏంచేస్తుంది. భర్త మనస్సు రానురానూ చెడిపోతూ వుంది. ఇంట్లో శాంతిలేకపోయింది. పాపం ఆవిడకుకూడా సూరి మీద కొంచెం అనుమానాస్పదం కలుగడానికి వాడు ఇంతకు పూర్వం చిన్న చిన్న దొంగతనాలుచేసి రూపాయి, అర్ధ నాశనంచేయడం జ్ఞప్తికి వొచ్చింది. ఈ ఘండాలుడు వంశనాశనానికి వొచ్చాడన్నంత ఆవేశం కలిగింది ఆవిడకు.

అ:-"క్షమించండి! నామూలాన బంగారంవంటి కాపురంలో తుపాన్లు చెలరేగించుటకు ఆస్పదం కలిగింది" అంటూ భర్తను పూరడించే మాటలుచెప్పి "అబ్బాయి వచ్చాక నేను కనుక్కుంటాను వాడిని. మీరు చెయ్యిచేసుకోకండి" అన్నది. ఆ సాయంత్రం సూరి వచ్చాక అన్నపూర్ణ సూరిని బుజ్జగిస్తూ, "నాన్నా! పొద్దున బీరువాలో వుంగరంతీశావా" అన్నది.

సూరి త్రుళ్లిపడుతూ "అదేంటి! వుంగరం, వుంగరం నేను దొబ్బేశాననా మీవుద్దేశ్యం? మావాళ్లు అయితే నన్నిలా అనేవారేనా!" అంటూ ఏడుస్తాడు; దాంతో అన్నపూర్ణ మనస్సు కరిగిపోయింది.

"ఛీ అల్లా ఎందుకనుకుంటావ్ వెర్రి తండ్రీ!" అంటూ కొడుకును అమాంతం చంకన పెట్టుకొని కళ్లుతుడిచి ముద్దెట్టుకొంటూవుండగా జోగారావుచూచి "భేష్! బాగావుంది; సూరిని బాగానే శిక్షిస్తున్నావు. నీవు వెర్రిబాగులదానవని వాడూ

మిరియాలు సూరకం ప్రారంభించాడు. ఇప్పణ్ణించీ గ్రహించాడు గనుకనే బొంగరం లాగ నిన్ను ఆడిస్తున్నాడు'' అన్నాడు. తరువాత వారంరోజులదాక ఇంట్లో దాసీ వాళ్ని, చాకలవాళ్లను ఇంటికివొచ్చిపొయ్యే వాళ్ని అందర్నీ వుంగరంకోసం గట్టిగా కనుక్కున్నారు. ఎక్కడా దొరికేమార్గం కనుపించలేదు. యిలాగే, మరికొంతకాలం తరువాత ఒకటి, ఆ తరువాత ఒకటి చిన్న చిన్న బంగారం వస్తువులు డబ్బు మాయమవుతూనే వున్నది. అన్నపూర్ణ సూరి ఇంత చిన్నకుఱ్ఱవెధవకదా వీడు యింతటి పెద్దదొంగతనాలు చేయడనుకొనేది. కొన్ని సంవత్సరాలు గడిచాయి. సూరి 18 సం॥ వాడయ్యాడు. ఈలోగా మీనకి పెళ్ళి, సూరి ఒడుగు అన్నీ అయ్యాయి. మీనని చెన్నపట్నంలో ఒక గొప్ప కుటుంబములోని మోహన్‌రావుకిచ్చారు. ఇతను 400 రూపాయలు జీతం తెచ్చుకొను గౌర్నమెంటు వుద్యోగస్థుడు. మీనకూడా మెట్రిక్ లేషన్ పాస్‌చేసి వుంటుంది. కానీసూరికి అక్షరం అబ్బలేదు. సెకెండ్ ఫారం పాస్ చేసేటప్పటికి దేవుడు దిగివొచ్చాడు. రాను రాను సూరి త్రాగుడు, జూదం ఇలాటి దుర్వ్యసనాలకుచిక్కి దత్తత తండ్రిని, తల్లిని పలువిధముల బాధపెట్టుచున్నాడు. ఒక నాటి చీకటిపడే సమయం. ఒక ఇరుకు సందులో సారాయి దుకాణంవద్ద సూరి మరొక స్నేహితునితోటి రహస్యంగా యిలా మాట్లాడుచున్నాడు. "వాడు చస్తేకానీ నాకు అధికారంరాదురా! అది నేను చెప్పినట్టు వింటుందిలే'' అన్నాడు సూరి. ''అందుకనే ఈ వుపాయం చెప్పాను. రేపటి నుండీ సర్వ స్వతంత్రం నీదే." సరేనంటే సరే అనుకున్నారు. ఎవరిదార్ని వారు పొయ్యారు.

ఆ రాత్రి జోగారావు భోంచేసి వార్తాపత్రిక పుచ్చుకొని కూర్చున్నవాడు, కడుపులో వికారంచేసి హటాత్తుగా ఒక్కడోకు డోక్కున్నాడు, కళ్లు తిరిగాయి, డాక్టర్ని పిలిపించమన్నాడు భార్యతోటి. పెద్ద డాక్టర్లు చూచుటకు వచ్చినపుడు హీనస్వరముతోటి జోగారావు ఇలా చెప్పాడు. "నాడోకు పరీక్షచేయండి. విషప్రయోగమున్నట్లు నాకు అనుమానంగా వున్నది. రాత్రి నేను భోజనానికి కూర్చున్నప్పుడు ఎప్పుడూ రానివాడు సూరి నా కంచం దగ్గర్నుంచీ రావడం చూచాను" అని అంటూవుండగానే అతనిచూపులు మారిపోయాయి. పరీక్షలు చేసిచూడగా విషప్రయోగమని డాక్టర్లు గట్టిగా చెపుతూ పట్టుకోండి పట్టుకోండని పారిపోతూవున్న సూరిని పోలీసులకి అప్పచెప్పారు. ఈలోపల జోగారావు దీర్ఘనిద్ర జెందాడు. అన్నపూర్ణ ఈ ఘోర దృశ్యముచూచి చైతన్యము తప్పి పడిపోయింది పాపం.




'సారపీచు'

అఖిలభారత మహిళా సభ ఉపాధ్యక్షురాలు శ్రీమతి బి. కామేశ్వరమ్మ కుప్పుస్వామిగారు ప్రఖ్యాత సంఘసేవకురాలు, శ్రీమతి డా. కృష్ణాబాయి నింబ్కార్ గారితో అమెరికాలో పర్యటన చేసి గ్రామీణుల సాంఘికకృషిని పరిశీలించగలందులకు ఇండియా ప్రభుత్వము ఫోర్డు ధర్మ సంస్థతో ఆలోచించి నిశ్చయించినదట.

ఈ పర్యటనలో శ్రీమతి కామేశ్వరమ్మగారు సంపాదించనున్న అనుభవము మనదేశమునందు సాంఘిక పురోభివృద్ధికి ఉపయోగకారిగా నుండగలదని ఆశిద్దాము.

♦ ♦ ♦

'తమిళనాడులో కల్లోలం—తుపాకికాల్పులు-మరణాలు, గాయాలు' వీనికంతటికి పైకి కనబడే కారణం మద్రాసు ప్రభుత్వం అమలు పెట్టనున్న నూతన ప్రాథమిక విద్యా విధానమట. కాని నిజానికి అది మాత్రం కాదు. దక్షిణాదిన కులతత్వవాదుల ప్రోత్సాహంతో రాజాజీ ప్రభుత్వాన్ని పదభ్రష్టు చెయ్యడానికి ఏర్పడిన ఉద్యమం.

♦ ♦ ♦

నిరుద్యోగ సమస్యను రాష్ట్రకేంద్ర ప్రభుత్వాలు రెండును పూర్తిగా పరిష్కరించగల స్థితిలో లేవని యీమధ్య ప్రకటనలమూలంగా తెలుస్తున్నది. అయితే ప్రభుత్వ ప్రకటనలేమన అవసరాలకు మించిన ఉత్పత్తి, ఆహార పదార్థములు, గుడ్డ దేశంలోనున్నవి కాని ప్రజలలో కొనుగోలు శక్తి లోపించినదని తెలియబరుస్తున్నవి. అయితే కరువుకాటకాలకు ఎవరు కారకులు?

ప్రజలలో సోమరితనం పెరిగిపోయిందని మాత్రం చెప్పలేము. పని చెయ్యడానికి తయారుగానున్న ప్రజలకు కనీసావసరాలను సమకూర్చగల సామర్థ్యం ప్రభుత్వంలో లోపించియున్నదన్నమాట!

నూతన పరిశ్రమలు, కార్ఖానాలు స్థాపించి నిరుద్యోగ సమస్య పరిష్కారానికి కృషిచెయ్యడం జరుగకపోగా ప్రతిదినం ఏదోమూల ఉన్న పరిశ్రమకేంద్రాలు మూయబడి అనేకమంది నిరుద్యోగులగుచున్నారు. ఆ పరిశ్రమలను తెరువడానికిగాని, పారిశ్రామిక పెట్టుబడిదారులచేత తెరిపించడానికి తగిన తెంపు ప్రభుత్వమునకు కనుపించుటలేదు.

♦ ♦ ♦

ఆంధ్రరాష్ట్రబిల్లు మద్రాసు శాసన సభలో 12 రోజులు సుదీర్ఘంగా చర్చించబడి ఆమోదించబడిన సందర్భములో తాత్కాలిక రాజధాని నిర్ణయమును గురించితప్ప మిగిలిన అన్ని ప్రధానాంశములమీద ఆంధ్ర శాసన సభ్యులు ఐకమత్యముతో వ్యవహరించి ఏకాభిప్రాయమును వెల్లడించడము హర్షించతగిన విషయము. ఆంధ్రేతర సభ్యులలోకూడ కాంగ్రెసేతరులు న్యాయదృష్టితో బిల్లునందలి ముఖ్యమైన క్లాజులను పరిశీలించడము ఆంధ్ర, పరిశిష్ట రాష్ట్రాలకు శుభసూచకమని చెప్పాలి.

ఆమోదించబడిన సవరణ తీర్మానాలలో ఉమ్మడి రాష్ట్రానికి సంబంధించిన ఆస్తి అప్పులను సుప్రీం కోర్టు న్యాయమూర్తి అధ్యక్షతన ప్రవీణుల సంఘం ద్వారా రెండు రాష్ట్రముల జనాభా నిష్పత్తి ననుసరించి పంపకము జరుగాలన్నదియు, పరిసర ప్రాంత్యాలలోగల ఆంధ్ర ప్రాంతాల భవితవ్య నిర్ణయము సరిహద్దు సంఘాలద్వారా జరుగాలన్నదీ ఆంధ్ర, పరిశిష్ట రాష్ట్రాలకు న్యాయము నుద్దేశించినవి. వీని కనుగుణ్యంగా యావదాంధ్ర ప్రజానీకం అప్రమత్తులై మెలగి తమ హక్కులేవో, అవకాశములేవో గుర్తించినచో ఆంధ్రులు తమ చిరకాల వాంఛితమగు రాష్ట్రం ఏర్పడుతుంది.

♦ ♦ ♦

అనేక సంవత్సరాల ఆందోళన ఫలితంగా నిర్మితమగు తుంగభద్ర ప్రాజక్టు ముఖ్యంగా రాయలశీమ పురోభివృద్ధి నుద్దేశించబడినది. దాని నిర్మాణ, నిర్వాణ బాధ్యతలు కేంద్రప్రభుత్వపు ఆధిపత్యాన ఉమ్మడి బోర్డుస్వీకరించనున్నదట. అయినా ఆంధ్రరాష్ట్రం లోని రాయలసీమ ప్రాంతాల అభివృద్ధి దృష్ట్యా ప్రాజక్టు నిర్మాణ నిర్వహణ బాధ్యతలు అధికభాగం ఆంధ్ర ప్రభుత్వపు చేతులోనుండాలి.

♦ ♦ ♦

నగరంలోని ప్రభుత్వభవనాలకు పరిహారంగా వాంఛూనివేదిక ననుసరించి పరిశిష్టరాష్ట్రం ఆంధ్ర రాష్ట్రానికి 230.4 లక్షల రూపాయలు యివ్వాలనే 7వ షెడ్యూలులోని క్లాజును తొలగించాలని తమిళ సభ్యులు సవరణను ప్రతిపాదించినప్పుడు ఆంధ్ర సభ్యులు, ఆంధ్రేతరులలో కొందరు తమ అసమ్మతిని సూచిస్తూ ఆ సవరణ అసందర్భమైనదనియు, ఉమ్మడి రాష్ట్రానికి సంబంధించిన ఆస్తి అప్పులను ఆంధ్రపరిశిష్ట రాష్ట్రాలకు సుప్రీంకోర్టున్యాయమూర్తి అధ్యక్షతన ప్రవీణుల సంఘంద్వారా రెండు రాష్ట్రముల జనాభానిష్పత్తిననుసరించి పంపకం జరుగాలనే సవరణలు ఆమోదించబడిన తర్వాత ఆ సమస్యలకు సంబంధించిన వివరములను కొన్ని చర్చించాలనికోరడం అర్థరహితమని శాసనసభనుండి నిష్క్రమించడము, తర్వాత తాము ప్రతిపాదించిన సవరణ నెగ్గినదని ఆంధ్రసభ్యులు లేని శాసన సభలో ప్రకటించుకోడం కేంద్ర ప్రభుత్వము గుర్తించియుండాలి.

♦ ♦ ♦

ఆంధ్ర పరిశిష్టరాష్ట్రాలు విడిపోవడంతో మద్రాసు నగర భవిష్యత్తుకంటె నగరంలోని ఆంధ్ర ప్రజానీకము తమభవిష్యత్తును రూపొందించుకోవాలసిన సమయంవచ్చింది. తమవ్యక్తిత్వానికి, ఆత్మగౌరవానికి భంగంరాకుండా తమ భాష, సంస్కృతుల విశిష్టతను కాపాడుకోవాలి. ఆర్థిక, రాజకీయ, సాంఘికరంగాలలో తమ న్యాయమైన హక్కులకు, అవకాశములకు భంగము కలుగకుండా అప్రమత్తులై మెలగాలి.

ఎవరు ఎన్ని అభిప్రాయములు వెలిబుచ్చినను మద్రాసు నగరముపై ప్రత్యేకమైన హక్కు మరెవ్వరికీ లేదు. అయినా వివిధభాషావాదుల వైజ్ఞానిక, రాజకీయ, సాంఘిక పురోభివృద్ధి దృష్ట్యా చీఫ్‌కమీషనరు రాష్ట్రం చెయ్యడం మంచిది. ఇందుకు ముందంజవేసి కృషిచెయ్యవలసినవారు నగరంలోని ప్రజానీకము. దానిననుసరించి అన్ని భాషాప్రాంత్యాలతోబాటు ఆంధ్ర రాష్ట్రముకూడ నగరంలోని ఈ కృషిని ప్రోత్సహించుతుంది. 8-8-53



# ఓదార్పు

అమ్మ "గృహలక్ష్మి!" నీ కండ్ల చెమ్మగిల్ల
తండ్రి హృదయమ్ము స్వర్గాన తల్లడిల్లు;
తెలియదా నీకు సైతము, దినదినమ్ము
యెంత గారాబమున పెంచె నిర్వదేండ్లు॥
ఏడ్పు చాలింపుమిక, కన్ను లెఱ్ఱబడియె
అన్ని తెలిసిన "గృహలక్ష్మి" వైన నీవె!
కండ్ల తడిబెట్టుకొన్న లోకంబునందు
చిట్టి చెల్లెండ్ర శోకంబు చెప్పతరమె!
కుమురుగ దుఃఖములన్ పయిట
కొంగున నద్ది బిరానరమ్ము; ఆ
సదమల మూర్తి యాత్మకు ప్ర
శాంతము గల్గ; సమాధిచెంత నె
మ్మదిగను పూజ సేయ; సుమ
మాలికలన్ గొనివచ్చితేని; ఆ-
యదె - అట - భక్తినుంచుము, మ
హాత్ముని యాత్మకు శాంతిగోరుచున్.

దూతలూరి జగన్నాథం

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

★

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

(గతసంచిక తరువాయి)

[...పాఠశాలలో అందరితోబాటు స్వామినాధన్, మణి, శంకర్, శామ్యూయల్, రాజం పరీక్షలు వ్రాశారు. పరీక్షలు కాగానే సెలవులకు పాఠశాలమూయబడింది. ఒకనాడు స్వామినాధన్ మణియింటికి వెళ్లి తనకు ఆరుకానులియ్యమనియు, దానితో గుఱ్ఱపుబండిని సంపాదించుకుంటానని అడిగాడు. మణిలేదనడంవలన నిరాశతో యింటికి వెళ్లాడు. మరునాడు రాజం యింటికి వెళ్లి తనతో ఒక పోలీసును పంపితే తన్ను మోసంచేసిన బండివానినుండి గుఱ్ఱపుబండినిగాని, తానిచ్చిన రెండణాలను గాని, వసూలు చేసికోకలుగుతానని అడిగాడు. తర్వాత మణి, స్వామినాధన్ కలిసి బండివానికొడుకునుతన్ని రెండణాలు వసూలుచేసికోవాలని బండివానియింటికి వెళ్లారు. మాయమాటలుచెప్పి బండివాని కుమారుని కొట్టాలని చేసిన ప్రయత్నం చుట్టూ నివసిస్తున్న ప్రజలు కుక్కలను ఉసిగొలుపుటవలను రాళ్లు రువ్వుటవలనను దెబ్బలకు గురియై పిక్కబలం కొద్దీ పారిపోవలసివచ్చింది — యిక చదవండి.]

## ౧౬

వేసవికాలమంతా, దక్షిణభారతములోకల్లా యెడారిమల్లే కనబడే పట్టణములలో 'మాల్గుడి' వొకటి!! ప్రతీ మధ్యాహ్నమునందు మాల్గుడి ప్రజలందరూ విపరీతమయిన వడగాడ్పులో బాధపడుతూవుంటారు! ఆఖరుకు కుక్క, గాడిద మొదలగు చిన్నహీనజంతువులు మధ్యాహ్న సమయములో షుమారు గం|| 2, 3 ల ప్రాంతమప్పుడు వీధులందు నడిచేందుకు భయపడుతూ వుంటాయ్!!

ఊరికి కొద్దిదూరములోనే ఆ ముగ్గురూ యెండలో గూర్చున్నారు. సమీపంలోనే సరయూనది ప్రవహిస్తూంది. ఆ ప్రాంతంలో వొక్కచెట్టయినా లేకపోవడం చాలా విచిత్రం! ఆ ట్రంకురోడ్డు యెడారిమల్లే వుండటం వాస్తవమైనప్పటికీ యెక్కడనుంచో బండివస్తూన్నట్లు సవ్వడి వినవస్తూంది!

“ఇంతకీ నేను చెప్పినట్లు చేసుకురాలేదు మణీ!” రాజమన్నాడు!

“అవును, రాజం! యిక్కడ మనం పన్నిన ప్రకారం అక్కడ మణి చేయనేలేదు ... మణి యేంచేసుకువచ్చినా, యిట్లా తగలబెట్టుకుంటూనే వస్తాడు!” అని స్వామి, మణిమీద రాజంతో కొండేలు చెప్పసాగాడు!

“అయ్యల్లారా, నేనొక మూర్ఖపు వెధవనని నేనే వొప్పుకుంటున్నాను—” అని మణి యేదో చెప్పబోతూంటే—

"ఎవరుకోసం?" అని స్వామి, మణివైఁపు కోపంగాఁజూస్తూ అన్నాఁడు!

"ఓరి వెధవా, మొదఁట నేను మనవిచేసేది విన్రా!" అని—

"...అక్కడ కొత్తగా నా మెదఁడు రచించిన ప్లాను ప్రకారం కార్యం నిర్విఘ్నంగా కొనసాఁగుతుందనుకున్నాను! ... బొంగరం వెపంతో వాడ్ని దొంగలిద్దామనుకున్నాను ... కానీ - నా పన్నాగములన్నీ భిన్నాభిన్నము లౌతాయని కలలోఁగూడా వూహించలేఁదు! ..." అని మణి విచారంగా అన్నాఁడు!

"ఊరుకుందు బాబూ, తలనొప్పిగావుంది!" అని స్వామి చిరాగ్గా అన్నాఁడు!

"బాబుల్లారా, అయ్యల్లారా! పది నిముషముల పాటు నేను చేసినతప్పు పరిహారార్థం, నాతలమీద నేను నిలఁబడతాను! మీరు నాకు శిక్షనిచ్చే వుద్దేశ్యమున్నట్లయితే, నేను చెప్పిందే న్యాయ సమ్మతం" అని చేతులు జోఁడుస్తూ, మణి తన మనస్సులోని వుద్దేశ్యాన్ని విన్నవించుఁకున్నాఁడు!!

గంటల 'గణగణ' శబ్దం యీ ముగ్గురికీ విన వచ్చింది. దగ్గరగా కట్టబడిన మేదరి వెదురుచాప గల ఎద్దుల బండొకఁటి వస్తూంది! వీళ్లకొక అఁడుగు దూరంలో బండుందనగా యీ ముగ్గురూ దిగ్గున లేఁచి, రోడ్డు కడ్డంగా నిలుఁబడి,—

"ఎడ్లనువిప్పు; విప్పుతావా?" అని పెద్దగా అరిచారు. ఆ బండిని తోలేవాఁడు ఒక పల్లెటూరు కుర్రవాఁడు.

"వెధవా, బండినాపరా?" అని రాజం అరిచాఁడు!

"వాఁడు బండినాపకపోతే, వాణ్ణి అరెష్టుచేసి, ఆ బండిని మా అధీనంలో వుంచుఁగుంటాం!" యీ మాటలు స్వామి నాథనన్నాఁడు.

"కుర్రాళ్లూ, నన్నెందుకాపమంటున్నారు?" అని ఆ బండివాడు ప్రశ్నించాఁడు!

"మాట్లాడవాకు" అనిమణంటూ, సీరియస్‌గా ముఖంపెట్టి, బండిచుట్టూ తిరుఁగుతూ చక్రాలను పరీక్షింపసాగాఁడు!

"ఏయ్, బండిదిఁగు!" అన్నాడు మణి!

"కుర్రాళ్లూ, నేను పోవాలి!" అని బండివాఁడన్నాఁడు!

"ఎవళ్లని నువ్వు 'కుర్రాళ్లూ' అని సంభోదిస్తున్నావ్? మేమెవరిమో నీకుఁ దెలుస్తా?" అని రాజం హుంకరించి అడిగాఁడు!!

"నీవంటి డాబుగాళ్ళను పట్టుఁగునే గవర్నమెంటు పోలీసులం; నీకు తెలుస్తా?" అని స్వామి దబాయించాఁడు!

"నోరెత్తావంటే క్కాల్చి చంపేస్తా!" నని రాజమన్నాఁడు. వాళ్లు అంటున్న మాటలనుబట్టి, వాళ్ళధికారులేమో అని ఆ కుర్రవాఁడు భయపడ్డాఁడు!

"యీ చక్రం చాలా నీరసంగావుందేం? ... నువ్వు ప్యాస్ (Pass) చూపించేవరకు నిన్ను విడ్చిపెట్టేదిలేఁదు!" అని మణన్నాఁడు!

"బాబుల్లార, అయ్యల్లారా నన్ను విడిచిపుచ్చేయండి!" అని బండివాడు బ్రతిమాలుకోసాగాడు.

"నోరు మూస్తావా లేదా?" అని రాజం బొబ్బరించాఁడు!

స్వామి రెద్దులను పరీక్షించి — "యిలారా!" అన్నాఁడు.

"యీ ఎద్దుల నెందుకు కడగఁలేదూ?" అని స్వామి వాడు చేసిన తప్పును యెత్తి చూపించాఁడు!

"ద్దుల్ని కడిగాను స్వామీ" అన్నాఁడు.

"అయితే - యిదెందు కిక్కడవుంది?" అని స్వామి ఓ నల్లమచ్చను చూపిస్తూ అన్నాడు!

"అదా? ఆ జంతువు పుట్టినప్పుడే ఆ మచ్చ వుంది బాబూ!" అన్నాడు!

"పుట్టినప్పుడా? నువ్వు నాకు బోధపర్చేందుకు ప్రయత్నిస్తున్నావా?" అంటూ, వాడిమీదకు స్వామి కాలెత్తాడు!

"వెధవా, ప్యాసు (Pass) చూపించు!" అని రాజం అన్నాడు! స్వామినాథన్ జేబులోవున్న పెన్సిలూ, పుస్తకం బయటకు తీసాడు.

"నీ పేరేమిటో చెప్పు!" రాజం ప్రశ్నించాడు.

"కరుప్పన్!" అని చెప్పాడు.

స్వామి పుస్తకంమీద రాసుకున్నాడు.

"వయస్సు!"

"నాకు తెలేదు బాబూ!"

"నీకు తెలీదూ? స్వామీ, నూరనిరాయ్!" అనిరాజమన్నాడు!

"లేదు బాబూ, లేదు బాబూ, నాకు నూరుం డవ్!"

"నోరు సంబాళించుకుని మాట్లాడు. నీకు నూరుంటాయ్ నువ్వు లేదని సమాధానం చెప్పావంటే- కాల్చి చంపేస్తాను!" అన్నాడు రాజం.

"నీయెద్దుల పేరేమిటి?"

రాజంతిరిగి ప్రశ్నించాడు.

"నాకుతెలీదు బాబూ!"

"స్వామీ 'కరుప్పన్' అని రాయ్!" అని రాజం అన్నాడు!

"అయ్యా, అది నా పేరుగాని, నా యెద్దుల పేరుగాదు బాబూ!" అన్నాడు. స్వామి మాత్రం - 'కరుప్పన్' అని పుస్తకం మీద రాసుకున్నాడు!

"ఎక్కడికి వెళ్తున్నావ్?"

"సెత్తూరు!"

అక్కడెంత కాలం వరకు వుంటావ్?"

"అది నా స్వస్థలం బాబు"

"అయితే యిక్కడేమిటి బరువు తీసుకొచ్చావ్?"

"పది బస్తాలతో కొబ్బరిబొండాలను స్టేషన్కు తోలానుబాబు!" అన్నాడు.

స్వామి ప్రతీది పుస్తకంమీద రాయసాగాడు. తరువాత - ఆ ముగ్గురూ ఆ కాగితం మీద సంతకాలుచేసి, కాగితాన్ని చింపి, బండివాడికిచ్చి, వాడు పోయేందుకనుమతిచ్చారు!!

## ౧౭

మే నెల రెండవవారంలో తండ్రి కోర్టుకు సెలవు లివ్వటంచాత, అతను యింటిలోనే గడపటంచాత, స్వామికి తన సెలవులను ఆనందంగా గడపటానికి బదులు యింటిలో నిరాశగా గడుపుతున్నాడు. తండ్రాజ్ఞలేకుండా, స్వామి బయటకు తిరిగేందుకెళ్ళాడో, ఆ వేళ స్వామి దేహం హూనమయిందన్నమాటే!

సెలవులిచ్చిన మూడవనాడు, రాజం, మణులతో హాక్కు గొట్టేందుకు నిశ్చయించి, అప్పుడే వీధులోకి జారుకుంటూన్న స్వామి నుద్దేశించి—

"స్వామి, యిలారా?" అని తండ్రి పిలిచారు. స్వామికి గుండె లొక్క పర్యాయము గతుక్కుమన్నాయ్!

తండ్రి నడింవాకిట్లో బనీను తొడుక్కుని నిలబడి వున్నారు. దీనినిబట్టి తండ్రెక్కడికి వెళ్ళరన్నట్లు రూఢిచేసుకున్నాడు!

"ఎక్కడికి వెళ్తున్నావ్ ?"

"ఎక్కడికిలేదు !"

"యింకే సమయాన్కి నిన్నొచ్చేటున్నావ్ ?"

"ఇక్కడే !"

"నువ్వు అబద్ధమాడుతున్నావ్. నిన్న యిక్కడ లేవు. యిప్పుడు తిరిగేందుకు బయటకు జారుకుంటున్నావ్ !"

"అది నిజ"మంటూ తల్లెక్కడినుండో అక్కడ కొచ్చి అంటూ —

"ఎండల్లోవాడి తిరుగుళ్ళకు హద్దూపద్దూ లేకుండావుంది, వాణ్ణివిధంగా విచ్చలవిడిగా విడ్చి పెట్టినట్లయితే, స్వామి - వడగాడ్పుకు ఆహుతి యెప్పుడో వొకప్పుడు అవకమానదు !" తల్లి అంది ! తనతో తన గదికి రమ్మనమని తండ్రి స్వామి కాజ్ఞాపించారు.

"ఎన్నిరోజులయిందయ్యా నీ పుస్తకాలను ముట్టుకుని ?" ఇటువంటి ప్రశ్నను యీ సెలవుల్లో ఎప్పుడో వొకప్పుడు వింటానని, స్వామి కలలోగూడా భావించలేదు !

"నాకు స్కూలు లేనప్పటికీ నేను చదవాలా నాన్నగారూ ?"

"బి. ఏ. ప్యాసైపోయాననుకుంటున్నావా ?" తండ్రి ప్రశ్నించారు.

"నాన్నగారూ, మాకు పరీక్షలైపోయి, స్కూలు మూసివేయబడినా నేను చదవాలా ?"

"ఏమిటా ప్రశ్న ? తప్పక చదవితీరాలి !"

"పరీక్షలముందర నాతో - ఇవి ముగిసిపోయిన తరువాత, మరి నేను చదువవవసరంలేదని మీరు చెప్పారే ! — ఆఖరికి రాజంకూడా చదవటం లేదు !" స్వామి చెబుతున్నవన్నీ కొంచెం పరాకుగా తండ్రి ఆలకిస్తున్నారు ! ...

ధూళి దూసరములతో నిండిన పుస్తకములన్నింటినీ స్వామి దులపసాగాడు...

"గబగబ కానియ్ ! ఆ పుస్తకాలను సంస్కరించడాన్కి ఒక రోజు కావాలటయ్యా ?" తండ్రి హెచ్చరించారు ! తుప్పుదులిపిన పుస్తకాలను బీరువాలో — ఒక వరుసలో పేరుస్తున్నాడు.

"అదేనా నీ యింగ్లీషు పుస్తకాన్ని జాగ్రత్త చేయవల్సిన విధానం ! నీకు సిగ్గువేయటంలా స్వామి !"

స్వామి యింగ్లీషు పుస్తకాన్ని తీసి, మడతపడిపోయినవాటి అట్టలను సరిచేసి, చేతితో అట్టల మీది ధూళిని దులుపుతున్నాడు.

"చిన్న గుడ్డ పీలికను తెచ్చుగో అబ్బాయ్ వస్తువులను శుభ్రపరిచే విధానమది కాదబ్బాయ్ !" అని హెచ్చరించారు.

"యిక్కడ నాకేగుడ్డా కనబడటంలేదు నాన్నగారు !" అని పిర్యాదు చేసాడు !

"లోపలకిపోయి చూడవయ్యా"

స్వామి మొదట నాయనమ్మ దగ్గరకు వెళ్లాడు !

"నాయనమ్మా, నాకోగుడ్డ పీలికుంటే అర్జంటుగా యివ్వు !" అని స్వామి గదమాయించాడు !

"నేనెక్కణ్ణుంచి గుడ్డపీలిక తెస్తానయ్యా."

"నేనెక్కణ్ణుంచి తెస్తాననుకున్నావ్ ?" స్వామన్నాడు.

"ఎందుకూ ?" నాయనమ్మ ప్రశ్నించింది !

ఇంతలో, హాల్లోంచి తండ్రి.—

"గుడ్డపీలిక దొరికిందా ?" అని కేక వేశారు !

"నాన్నమ్మ లేదంటూంది ; అమ్మదగ్గరుందేమో కనుక్కు నివస్తాను" అని స్వామంటూ, పిల్లవాణ్ణి కాళ్లమీద పడుకోబెట్టి కూర్చున్న తల్లి దగ్గరకు వెళ్ళాడు !

"అమ్మా, నాకో గుడ్డపీలికుంటే యిస్తావా?" స్వామన్నాఁడు!

"ఏం గుడ్డయ్యా?"

"హుఁ! ఏం గుడ్డా? తెలీదూ, తెలీదూ? ఏంగుడ్డో నాకేందెల్సు?"

"గుడ్డపీలి కెక్కడుందో నాకుఁ తెలీదయ్యా?" తల్లియంది!

"ఉఁహూఁ! నీకు - నీకు - తెలీఁదూ? ___" మీఁదకో పర్యాయము చూశాఁడు. తన తమ్ముణ్ణోతూరి పరిశీలించాఁడు. వాఁడి బొడ్డుమీఁద ఒక గుడ్డపీలికున్నట్లు కళ్లు, దృష్టికేంద్రమునకు రిపోర్టు చేసాయ్. కనురెప్పపాఁటు కాలంలో స్వామి, తమ్ముణ్ణి క్రిందకు దొర్లించి, ఆకాఁజేసిన గుడ్డపీలి కత్తో తన గదిలోకి పరుఁగుతీసాఁడు!

స్వామి అన్ని వస్తువులను శుభ్రంగా శుభ్రపరచి, ఒకదాని తరువాత వొకఁటి టేబిలుమీఁద పేరుస్తున్నాఁడు! తండ్రొక్కమారు పరిశీలించారు!

"వస్తువులను జాగ్రత్తపరిచే విధానమదేనా? తేలికవస్తువులను క్రిఁదను, వాఁటిమీఁద బరువు వస్తువులను పెట్టు" అన్నారు. యింతలో - స్వామి తల్లి బిడ్డతోఁడి ప్రవేశించింది.

"చూశారా స్వామి, కుర్రాడి గుడ్డను తెచ్చేశాఁడు. వాడ్ని అదుపాజ్ఞల్లో పెట్టేవారు యీ ఇంట్లో లేనేలేరా ... ఎన్నాళ్లవరకు వీఁడినిట్లా మూసుక్కుంటారో నాకర్థం అవటంలేదు" అని భర్తతో స్వామిమీఁద పిర్యాఁదుఁజేస్తూ, నూట్లింకా తెరవనందుకు యెంతో విసుక్కుంది!

ఆవిడచేసిన పిర్యాదుకు యెంతో కోపం దెచ్చుఁగోవల్సిన స్వామి తండ్రి, నవ్వి, ఆమె చేతుల్లోవున్న కుర్రాడి బుగ్గను మెల్లగా నులిమారు!

అరగంట తరువాత, పలకను ముందరఁ బెట్టుగుని, తండ్రి గదిలో, అతని సమక్షంలో, ఒక కుర్చీలో స్వామిఁ కూర్చున్నాఁడు!

(సశేషం)






# నేత్రరోగహారములు

పటికి నీళ్లను కండ్లలో వేసిన నేత్రరోగములకు సంబంధించిన కండ్లకలకలు, ఎరుపులు నయమగును.

పసుపును నీటితో అరగదీసి కండ్లలో పెట్టుకొనిన నేత్రరోగములు హరించును. దాల్చిన చెక్కనుగాని, పసకొమ్మునుకాని అరగదీసి ఆ గంధమును కండ్లకు పెట్టుకొనినను కండ్లయొక్క కాంతి అధికమగును.

ఉసిరికాయ, కందగెడ్డలు మనయిండ్లలో వంటకములలో నుపయోగించుచున్నాము. ఉసిరికాయ అత్యంత వైద్యోపయోగముకలది. ఉసిరికాయపచ్చడి, కందగెడ్డను కూరగాను, వరుగులుగాను, పచ్చడిగాను అన్నసాధకములుగా వాడుకలోనున్నవి. ఇవి నేత్రములకు చలవచేయును.

గుంటకలగరాకురసము, హారతికర్పూరములుకూడ కండ్లకు చలవచేయునట్టివియే.

జాజికాయను నీళ్లతో నరగదీసి ఆ నీటిని కండ్లలో వేసిన కండ్లనొప్పి నివారణమగును.

తమలపాకుల రసమును కండ్లలో పిండుకొనిన నేత్రరోగములకు సంబంధించిన రేజీకటిని పోగొట్టును.

కండ్లమంటలకు రక్త చందనము మంచిది.

అవిశపువ్వుల రసమును కండ్లలో పిండిన మసకలు, మందదృష్టి నివారణమగును.

తెల్లదిగాని, ఎఱ్ఱదిగాని గజ్జేరువేరును ఆవునేతితో అరగదీసి అంజనము వేసిన దురదలు నిమ్మళించును.

# నారంజపండ్లు మారమలేడు

శ్రీ అద్దేపల్లి వెంకట సుబ్బారావుగారు



ఏమండీ, నారింజపండ్లని అనేక విధాలుగా వాడుకోవచ్చునన్నారు. ఏయే వస్తువులు తయారు చేయవచ్చునో చెపుతారా?

నారింజకాయల్తో మారమలేడు, సిరప్, ఫ్రేష్ మొదలైనవి తయారు చేయవచ్చు. అవి అన్ని ఋతువుల్లోను ఎక్కువగా రావు. అందుచేత ఎక్కువగా వచ్చే కాలంలో, కొని తయారు చేసుకొని, తరువాత వాడుకోవచ్చు. ఇపుడు మారమలేడు తయారుచేసే పద్ధతి చెపుతాను. వ్రాసుకుని తయారు చేస్తారా?

చెప్పండి. తప్పకుండా చేస్తాను.

బాగా తయారైన నారింజకాయలు తెచ్చి-

ఆఁ, ఆగండి. ధర్మసందేహం మొదటనే వచ్చింది. బాగా తయారైనవి అంటే పసుపు పచ్చగా పండిన కాయలేనా!

కాదు. దోరగా తయారైనవి అన్నమాట. ఆకుపచ్చగానే వుంటాయి. వాటిల్లో రసం ఎక్కువగా వుంటుంది. కాయలు కొంచెం బరువుగా వున్నవి చూచి తీసుకోవాలి. తెలిసిందా?

తెలిసింది. తరువాత చెప్పండి.

దోరగా తయారైన కాయలు తెచ్చి ఒక బేసిన్‌లో వేసి వాటిపైన వేడినీళ్లు పొయ్యాలి.

బాగా సలసలకాగే నీళ్లు పొయ్యాలా?

ఎబ్బే. కాదు. మనచెయ్యి భరించగలిగినంత వేడిగా వుంటేచాలు. వేడినీళ్లు పోసిన తరువాత ఐదునిమిషాలు ఆగి చేతితో కాయల్నికడిగి ఒక గుడ్డతో తుడవాలి.

వేడినీళ్లతో కడగటం దేనికి?

కాయల పెచ్చులో వొకవిధమైన చమురు వుంటుంది. కాయల్ని వేడి నీళ్ళలో వేయగానే ఆ చమురు పైకి వచ్చేస్తుంది.

తరువాత యేం చెయ్యాలి?

కాయల్ని కత్తితో సగానికి రెండుగాకోసి రసం ఒక గిన్నెలోకిపిండీ, గింజలు లేకుండా తీసివేసి ఒక చోట వుంచాలి. తరువాత డిప్పల్లోవున్న తొనలు తీసిపారేసి పెచ్చుల్ని సన్నగా కొయ్యాలి.

అన్ని డిప్పలూ కొయ్యాలా?

అక్కర్లేదు. మొత్తం డిప్పల్లో సగంచాలు. సన్నగా ముక్కలుకోశాక వాటిని ఒక గిన్నెలోవేసి అవి మునిగేటంతవరకు, మంచినీళ్లుపోసి పొయ్యిమీదపెట్టి మెత్తగా వుడికించాలి.

అదేమిటండీ, అవతల పారేశే పెచ్చులకి అంత పని చెప్పారు?

మంచిదానివే. అవుసరమైన పదార్థము ఆ పెచ్చుల్లోనేవుంది. దానిని వదిలేసి రసం మాత్రం వాడుకుంటున్నాము.

ముక్కల్ని కుంపటిమీదపెట్టి ఉడికించమన్నారు గదా - యెంతసేపు వుడికించాలి?

ముక్కలు బాగా మెత్తపడేవరకు వుడకాలి. తరువాత పొయ్యిమీదనుంచి దింపి చల్లార్చి వాటిని కొంచెం కొంచెంగా ఒక గుడ్డలోవేసి గట్టిగా పిండితే క్రిందకి చిక్కని ద్రవపదార్థం గోధుమవర్ణంలో దిగుతుంది. దానిని పెక్టిన్ అంటారు. నారింజపండులో తినవలసిన పదార్థం యిదే.

ఈ చిక్కటి రసాన్ని త్రాగితే చేదుగావుండదు?

వుంటుంది. అందుకనే దానిని పండ్ల రసంతో కలిపి వుపయోగిస్తారు.

ఈ పెక్టిన్‌ను యేమి చెయ్యమంటారు?

దీనిని (పండ్లరసం పిండి, వేరేవుంచిన పింగాణి గిన్నెలోపోసి) చక్కగా కలపాలి. తరువాత మొత్తం రసాన్ని తూచి, దాని తూకానికి సరిపడిన పంచదార తూచి కలిపి పొయ్యిమీదపెట్టి కాచాలి.

అట్లా యెంతసేపు కాచాలి?

రసంతో కలిపిన పంచదార పూర్తిగాకరిగి పాకం తయారయ్యేవరకు కాచాలి.

పాకం వచ్చిందిలేనిది యెట్లా తెలుస్తుంది?

ఒక సాసర్లో కొద్దిగా నీళ్లుపోసి, దానిలో కాగుతూవున్న రసం కొద్దిగా గరిటెతో తీసిపోస్తే పాకం వచ్చివుంటే అది గట్టిగా వుంటుంది. పాకం రాకపోతే సాసర్లోవున్న నీళ్ళలో కలిసిపోతుంది. ఇట్లా వొకటి రెండుసార్లుచూచి, పాకం వచ్చాక పొయ్యిమీదనుంచిదింపి పూర్తిగా చల్లారేవరకు గరిటతో కదుపుతూ వుండాలి. అప్పుడది చల్లారుతూ క్రమంగా చిక్కబడటం ప్రారంభించి చివరకు పూర్తిగా గట్టిపడుతుంది.

మరి రంగేమన్నా కలపాలా?

వద్దు. పూర్తిగా పాకం వచ్చాకచూస్తే, నారింజపండు రంగు సహజంగానే వస్తుంది.

ఇంతకీ దీనిరుచి పుల్లగా వుంటుందా - తియ్యగ వుంటుందా?

ఈ సంగతి నువ్వు అడుగుతావో అడగవోనను కుంటున్నా. అసలు నారింజకాయలు పుల్లనివి చూచి తెచ్చుకోవాలి. బాగా పుల్లగావున్నా పంచదార కలుపుతున్నాం గనుక పరవాలేదు. కాని సాధారణంగా వేసవిలో వచ్చేనారింజకాయలు, తక్కిన ఋతువుల్లో వచ్చేవాటికన్న తియ్యగా వుంటాయి. మారములేదు కొంచెం పులుపుగా వుంటే గాని రుచిగా వుండదు. కనుక బాగా పండిన ఒకటి రెండు నిమ్మకాయలుకోసి ఆ రసం నారింజపండ్ల రసంలోనే కలిపి కాచాలి.

ఈ మారములేడు ఒక్క నారింజకాయలతోనేనా యింకేపళ్ళతోనైనా చేస్తారా?

నిమ్మ, చక్కరకేళి మొదలైనవాటితో కూడ చేస్తారు. కాని వానిని వేరువేరు విధాలుగా చెయ్యాలి. ఆ చేసే పద్ధతులు యింకోమారు చెప్తాను. ఇంతకీ తప్పులేకుండా వ్రాసుకున్నావా? ఏదీ చదువు.

వినండి. దోరగా పండిన నారింజకాయలుతెచ్చి వొకబేసినులోవేసి వాటిపైని వేడినీళ్లుపోసి ఐదు నిముషములుఆగి చేతితోకడిగి గుడ్డతో తుడవవలెను. పిదప కాయలను కత్తితో రెండుగాకోసి రసం ఒక పింగాణి గిన్నెలోపిండి గింజలు తీసివేయవలెను. తరువాత పైపెచ్చులలోవున్న తొనలను తీసిపారేసి మొత్తం పెచ్చులలో సగం పెచ్చులను సన్నగా ముక్కలుకోసి వొక గిన్నెలోవేసి అవి మునుగునంత వరకు నీళ్లుపోసి పొయ్యిమీదనుంచి మెత్తగా వుడికించవలెను. ముక్కలు బాగుగా మెత్తపడినపిదప దింపి చల్లార్చి వొక గుడ్డలోవుంచి గట్టిగా పిండిన క్రిందకు చిక్కగా గోధుమ వర్ణంలో రసముదిగును. దీనిని పెక్టిన్ అందురు. దానిని పండ్లరసములో పోసి కలిపి తూచి రసమునకు సరిపడ పంచదారకూడ తూచి కలిపి పొయ్యిమీదపెట్టి కాచవలెను. కొంత సేపు రసమునకు పాకమువచ్చువరకు కాచి దింపవలెను. బాగుగా చల్లారిన పిదప గట్టిగానున్న మారములేడును నోరువెడల్పుగల సీసాలు కడిగి వానిలోపోసి మూతపెట్టవలెను. అంతేనా- తప్పులేకుండా వ్రాసుకున్నానుకదూ? తప్పకుండా తయారుచేస్తానండి.

విజయవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో

# కీ. శే. కేసరిగారి సంస్మరణ

శ్రీమతి యస్. కే. సీతాదేవి



బుద్ధుడు జీవుల కష్టము
లిద్ధరణిఁ రూపుమాప నెంచినగతినే ;
యిద్ధ చరిత్రుఁడు కేసరి
సద్ధర్మాసక్తి జనుల సౌఖ్యము వలచెన్ ॥

అన్యభాషలనక ; అన్యవర్ణములంచు
భేదమింతలేక బీదలకును,
స్త్రీలు, బాలురకును, సేవగానీయన
చేసియున్న మేలు చెప్పదరమె ! ॥

ఎక్కడి మళయాళంబది
యెక్కడి యాంధ్రంబు వియ్య మెట్టుల పొసగున్
మక్కువకల కులపతియై
యక్కజముగ వాసికెక్కె నతిధీరుండై ॥

స్వానుభవముచే, బీదల సంకటంబు
లెఱిగి, యైశ్వర్యమొదవిన దఱినిగూడ;
ఈవి మఱవక దాతయై ఎన్ని యెన్ని
దాన ధర్మముల్సేయుచు ధన్యుడయ్యె. ॥

గృహిణులకూతయై గృహలక్ష్మి దెచ్చిన,
స్త్రీలోక జనకుడ దృశ్యుడయ్యె ;
నాంధ్రవాఙ్మయ పోషణార్థమై సతులకు
స్వర్ణకంకణమిచ్చు కర్ణుడరిగె ;

బాలుర బడులకై బహు విరాళంబుల
ప్రీతితో నిచ్చిన దాత చనియె ;
అమృతోపమంబులైనట్టి యౌషధముల
ప్రజలకిచ్చిన వైద్యవరుఁడు పోయె ;

నాంధ్రలోకమెల్ల నీతిశోకమునమున్గ
కేసరీవియోగ ఖేదమువను ;
విశ్వప్రేమియై వారి గోల్పోవుట,
దక్షిణాపథంబె తాపమందె.




# పుల్లగూర

శ్రీమతి జ్ఞానరత్నం

లక్ష్మయ్య ఒక నియోగి బ్రాహ్మణుడు. భార్య సుబ్బాయమ్మ భలే చలోక్తిమనిషి! అసలు సుబ్బాయమ్మకూ, లక్ష్మయ్యకూ, ఒక్క నిమిషమయినా పడేదికాదు. అంటే! ఎప్పుడూ యేదో ఒకటి పెట్టుకొని వాదులాడుకొంటూ వుండేవారు. కాదు! అంటే! అరవ్వాడి చెప్పు, ఆనేరకం వాళ్ళతగవు.

పాపం సుబ్బాయమ్మ వంట ఎంత బాగా చేసినా సరే! ముసలివాడయ్యాడేమో! లక్ష్మయ్య, ఏదో ఒక సాధకం బాగాలేదని వంకపెట్టైనా, గోల చేయందే కూర్చున్న పీటమీదనుంచి లేచేవాడు కాదు.

పాపం సుబ్బాయమ్మ మాత్రం ఎంతసేపని ఓర్చుకుంటుంది? అయితే ఒకసారి కాకపోయినప్పటికీ, ఒకసారన్నా! లక్ష్మయ్యమీద కోపం ఒచ్చినా! మళ్ళీ తనకు భర్తమీద వుండే పతిభక్తియొక్క ప్రభావంచేత! సావిత్రి: సీత: దమయంతి: వరుసగా పతివ్రతలనందరినీ తలుచుకొని తన కోపాన్ని తనలోనే అణుచుకొని వెనకా, ముందూ ఒక్క మాటన్నా అనేదికాదు.

లక్ష్మయ్యభార్యకు(ఒకొక్కప్పుడు,)శతమానం! సమర్పించినప్పటికీ, మళ్ళీ తనభార్యకు తనమీద వుండే గౌరవ మర్యాదలను తలుచుకొని తనలో తాను మురిసిపోయేవాడు.

అదీ యెప్పుడైనా! మళ్ళీ సుబ్బాయమ్మ ముఖబింబం తన యెదుట ప్రత్యక్షమయిందంటే చాలు! ఆగ్రహానికి గురి అయేవాడు.

అసలు సంగతి ఏమిటంటే! సుబ్బాయమ్మ ఎప్పుడు పుల్లగూర చేసినాసరే దానిలో లేకున్నా! ఒక్క గడ్డిపోచన్నా వచ్చిందని గోలచేయందే లేచేవాడు కాదు. అది లక్ష్మయ్యకు పరిపాటి అయింది. ప్రతిరోజూ యిలా గోలచేస్తుంటే తగిన శాస్తిచేయాలని సుబ్బాయమ్మ ఆలోచించగా! ఆలోచించగా! సుబ్బాయమ్మకు ఓచక్కటి ఆలోచనతట్టింది.

యిలా ఆలోచిస్తూనే ఓచాటపట్టుకొని పెరట్లోకి వెళ్ళి దానినిండుగా మంచిలేత గడ్డిని కోసుకొచ్చింది. సన్నగా తరిగి ఓ పత్తుపాత్రలో వేసి వుడికించి తగిన సామగ్రివేసి చక్కటి పుల్లగూర తయారుచేసి వుంచింది.

అప్పుడే ఎక్కడినుంచో ఊడిపడ్డాడు లక్ష్మయ్య ఎట్లయినా నియోగానికి చెందిన బ్రాహ్మణుడు కదూ! భార్య అందించిన చెంబెడు నీళ్ళతో కాళ్ళూ చేతులూ శుభ్రంగా కడుక్కొని భోజనానికి కూర్చున్నాడు.

మన సుబ్బాయమ్మ తాను చేసిన పుల్లగూరను వడ్డించింది. భలే వున్నదంటూ లొట్టలు వేస్తూ తిన్నాడు లక్ష్మయ్య పిచ్చివాడు.

తానుకూడా, సీతా! సావిత్రీ, ఇంకా, ఇంకా, పతివ్రతల్లో కలిసిపోయ్యానని మురిసిపోయింది సుబ్బాయమ్మ

## తద్ధినం

మా నాన్నగారిది గవర్నమెంటు ఉద్యోగమవడం చేత, తరుచు ట్రాన్సఫరవుతూవుండేది. దానితో బాటు బంట్రోతులు కూడ మారేవారు. ఆ ఊళ్లో ఉన్నపుడు ఒకముసలి సాయబు బంట్రోతుగా ఉండేవాడు.

ఒకరోజున మా యింట్లో మా తాతగారి తద్దినం వచ్చింది. ఏదైన పనిఉంటుందని ఆరోజున సాయబునికూడ మా యింటిదగ్గరే ఉండమన్నారు. అందరి భోజనాలు అయింతర్వాత బంట్రోతుకికూడ భోజనం పెట్టారు. గార్లె, అరిసెలు, నాలుగు కూరలు నాలుగు పచ్చళ్లు; ఇవన్నీ సాయబు కడుపునిండా తిన్నాడు. భోజనం అయింతర్వాత 'అమ్మగారూ! ఇవాళ మీ యింట్లో ఏమిటి అండీ!' అని అడిగాడు. మా అమ్మ 'ఇవాళ మాయింట్లో తద్దినం సాయబూ' అని చెప్పింది. అదివిని సాయబు అదేదో పండుగ అనుకున్నాడో ఏమిటో 'అలాగా అమ్మగారూ! "హల్లా" దయవల్ల మీ యింట్లో తద్దినం మీద తద్దినం రావాలి. నాకు ఎప్పుడూ భోజనం దొరకాలి' అంటూ దీవించాడు. అదివినేటప్పటికి మా కందరికీ కడుపు చెక్కలయేట్టు నవ్వు వచ్చింది.

సాయబుల్లో ఎవరయినా చనిపోతే, గోరికట్టించడమే కాని వాళ్లు తద్దినాలు ఏమీ పెట్టరు. అందుచేత అతనికి తద్దినం అంటే ఏమిటో చెప్పవలసి వచ్చింది. మా అమ్మ ఆ సాయబుతో యిలా చెప్పింది: 'తద్దినం అంటే పండుగ కాదు సాయబూ! మాలో పెద్దవారు ఎవరయినా చనిపోతే వారి సంతృప్తికోసం ప్రతియేడు ఒకరోజున బ్రాహ్మణుల చేత మంత్రాలు చదివించి పిండివంటలతో వారికి భోజనం పెడతాము. దీనికే తద్దినం అంటారు. ఇవాళ మా మామగారి తద్దినం'

అది విన్న సాయబు పశ్చాత్తాప్పడ్డాడు.

సి. హెచ్. శ్రీరామమూర్తి

## కావాలి

చల్లటిగాలి కావాలి
తెల్లటిబువ్వ వుండాలి
కరువు గిరువు పోవాలి
కమ్మటి పంటలు పండాలి
కనులకువిందు జరగాలి
మారాజుల మనసు మారాలి
దరిద్రుల కష్టాల్ తొలగాలి
ఐకమత్యభావం పెంపొందాలి
అందరొకటే అని మారాలి
అమ్మదండన వుండాలి
సకాల వర్షం కురవాలి
అందుకు ప్రార్థన జరపాలి
ప్రపంచశాంతి కోరాలి
పేద బీద హాయిగ బ్రతకాలి
అందరం ఐక్యంతో మెలగాలి
అహం అందరిలో చావాలి
ఆంధ్రరాష్ట్రం కావాలి!

మిస్. నిరుపమ గురుకుల్



# లోకవార్తలు

నెల్లూరు సినిమాప్రేక్షక సంఘము జూలై 16 వ తేదినజరిగిన సమావేశంలో శ్రీ డేగా రాధాకృష్ణయ్యగారి అధ్యక్షతన శ్రీ కే. యస్. కేసరిగారి మరణమునకు సంతాపమును తెలుపుచూ 'గృహలక్ష్మి' ప్రతికను నెలకొల్పి స్త్రీజనాభ్యుదయమునకు చేసిన అపారసేవను స్మరించుచు శ్రీ కేసరిగారి ఆత్మశాంతి కొరకు భగవంతుని ప్రార్థించుచు 2 నిమిషములు మౌనమును వహించిరి.

ది 8-7-1953 న ఖర్గపూరు ఆంధ్రరచయితల సంఘకార్యవర్గసమావేశమున డా. కేసరిగారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థించుచు ఏకగ్రీవముగా తీర్మానించబడెను.

♦ ♦ ♦

దక్షిణాఫ్రికా భారతీయుల భార్యాబిడ్డలు దేశంలో ప్రవేశింపకుండా నిషేధించే శాసనమును పార్లమెంటు సమావేశములో మలాన్ ప్రభుత్వము చేయమన్నదట.

♦ ♦ ♦

సుప్రసిద్ధన్యాయవాది, జాతీయ సమరయోధుడు, లలితకళాభిమానియగు బాపట్ల వాస్తవ్యులగు శ్రీ మాధవపెద్ది కాళిదాసుగారు 25-7-53 నాడు మరణించిరి.

♦ ♦ ♦

విశాలాంధ్ర ఉద్యమాన్ని తీవ్రతరం చేసేందుకుగాను విశాలాంధ్ర మహాసభను పునరుద్ధరించి 40 మంది సభ్యులుగల కార్యవర్గ ఏర్పాటుచేసినట్లు అధ్యక్షుడు శ్రీ అయ్యదేవర కాళేశ్వరావుగారు చెప్పుతూ ఆంధ్ర, మాళిక, హైదరాబాద్, ఒరిస్సా, మైసూరు, మధ్యప్రదేశ్ తదితర తెలుగు భాషా ప్రాంత్యములనుండి 250 మంది సభ్యులుగల స్థాయి సంఘం ఏర్పాటు చేయబడిందని ప్రకటించారు.

♦ ♦ ♦

బళ్లారి ఆంధ్రోద్యమ సందర్భమున నిరాహార దీక్ష పూనియున్న శ్రీ కామిరెడ్డిగారు పండిత నెహ్రూ సలహా ననుసరించి దీక్షను విరమించారు.

♦ ♦ ♦

ఆంధ్రబిల్లుపై మద్రాసు శాసనసభలో చర్చజరిగిన సందర్భమున కర్నూలుకు బదులుగా గుంటూరు-విజయవాడ ప్రాంత్యాన్ని తాత్కాలిక రాజధానిగా చేయాలనిన సవరణతీర్మానము అయిదుగురు ఆంధ్రేతర సభ్యులు జోక్యము కల్పించుకొని ఓటు చేసినందువలన వీగిపోయినది.

♦ ♦ ♦

ఈ ఏడాదినుండి తమిళ, మలయాళ, కన్నడ సంస్కృతి భాషలలో ఆస్థానకవుల పదవులను మద్రాసు ప్రభుత్వము రద్దుచెయ్యదలచినదట. తెలుగు ఆస్థానకవి పదవిమాత్రం 1955 సం. మువరకు నిలచియుండగలదట.

♦ ♦ ♦

ఇండియామంత్రివర్గము సోషల్ వెల్ ఫేరుబోర్డును (సాంఘిక సేవాసంఘాన్ని) ప్లానింగ్ కమిషన్

సిఫార్సుల మేరకు నెలకొల్పింది. ఈ బోర్డు సేవా సంస్థల ప్రస్తుత కార్యక్రమాలకు సలహాలిచ్చి తోడ్పడుతుంది.

♦ ♦ ♦

గోల్డ్ కోస్ట్ పౌరుడు జోసెఫ్ ఎమాన్యుయల్ అప్పయ్యను సర్ శాఫర్డ్ క్రిప్స్ చిన్నకుమార్తె పెగ్గీ క్రిప్స్ వివాహమాడింది.

♦ ♦ ♦

ఆంధ్రరాష్ట్ర వ్యవహారాలలో స్పెషలు ఆఫీసరుగా శ్రీ చందులాల్ త్రివేదిగారు నియమించబడ్డారు. వారు అక్టోబరు 1 వతేది నాటికి రాష్ట్రావతరణకు తగు చర్యలను త్వరితంచెయ్య నుద్దేశించబడ్డారు.

♦ ♦ ♦

ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్ర శాసనసభలో 196 మంది సభ్యులుండగలరు.

♦ ♦ ♦

కాలిఫోర్నియాలో జరిగిన పోటీలో ఫ్రెంచి యువతి క్రిసీని మర్టెల్ ప్రపంచసుందరిగా ఎన్నుకోబడింది. ప్రపంచ మొత్తముపై జరిగిన అందగత్తెల పోటీలో అమెరికా, జపాన్, మెక్సికో, ఆస్ట్రేలియా దేశముల యువతులు వరుసగా ద్వితీయ, తృతీయ, చతుర్థ పంచమస్థానా లివ్వబడినవట.

♦ ♦ ♦

షేక్ అబ్దుల్లా కాశ్మీరు ప్రధాని పదవినుండి బర్తరఫు చేయబడటంతో బాటు యీ నెల 9వ తేది ఉదయం 10 గం॥లకు అప్రజారక్షణ చట్టముక్రింద అరెస్టుచేయబడి నిర్బంధములో నుంచబడ్డారు. ఇందుకు కారణము ఆయన మంత్రి వర్గములో ఏర్పడిన కలతలు, ఆయన నిరంకుశత్వము, అసమర్థమైన పరిపాలనా విధానమని వార్తలు.

ఎయిడెడ్ ఎలిమెంటరీ, హైయర్ ఎలిమెంటరీ స్కూళ్ళ ఉపాధ్యాయులు శాసనసభ, స్థానిక సంస్థల ఎన్నికల ప్రచారంలో పాల్గొనడానికి, అభ్యర్థులుగా నిలువడానికి అనుమతిస్తూ మద్రాసు ప్రభుత్వము ఉత్తర్వులు జారీచేసింది.

♦ ♦ ♦

శ్రీ రవివర్మ చిత్రకళా విధాన పునరుజ్జీవంకొరకు మద్రాసులో నొక పాఠశాల స్థాపించబడింది.

♦ ♦ ♦

పంచాయతీస్థాపనకు కావలసిన జనాభా 500 నుండి వెయ్యికి హెచ్చబడినది.

♦ ♦ ♦

బరేలీలో చమేలీదేవి పేరుగల 19సం. ముల బాలిక ఆపరేషన్ చేసి ఇంజక్షన్లిచ్చిన ఫలితంగా బాలుడుగా మారిందట. దానితో బాటు పేరుకూడ చంద్రప్రకాశ్‌గా మారింది.

♦ ♦ ♦

డాక్టర్ శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ కాలధర్మం కారణంగా ఖాళీయయిన పార్లమెంటు స్థానానికి కలకత్తానుంచి జరిగే బై ఎలెక్షన్‌లో పశ్చిమబెంగాల్ కమ్యూనిష్టుపార్టీ తరఫున శ్రీమతి అరుణా అసఫాలి పోటీ చేయనున్నదట.

♦ ♦ ♦

ఫిలడల్ఫియాలోని జెఫర్సన్ వైద్యకళాశాల ఆసుపత్రిలో పనిచేస్తున్న డా. జాన్‌గిబ్బన్ (జూనియర్) ఒక యంత్రాన్ని కనిపెట్టాడట. ఈ యంత్ర సహాయంవలన శస్త్రచికిత్సపొందే రోగి హృదయం, ఊపిరితిత్తులు తాముచేసేపనిని ఒడిదుడుకులు లేకుండా చేయగలవట. శస్త్రచికిత్స విజయవంతంగా ముగించడానికి యంత్రము తోడ్పడుతుంది.





# శుభ శ్రావణి



(సమయానుకూలము 3వ, 4వ శుక్రవారమని పాడవచ్చును)

శ్రీ జొన్నవిత్తుల శ్రీహరిపాండురంగ వరప్రసాదరావు

శ్రీమతి జొన్నవిత్తుల సీతామహాలక్ష్మి.



జయజయజయ యంచూ జంతులు శబ్దముచేయా
టపటప వర్షపుచినుకులు కురియుచు నుండగనూ
కడిగిన ముత్యాలై చెట్లూ బడలికదీర్చుకొనా
రంగులు నీటనుగలసీ రహిమించెడివేళా
వచ్చిందిశుభశ్రావణమూ వచ్చిందమ్మాయీ
పేగంటాలదినాలన్నీ వచ్చినవివిగో ॥
మంగళవారాలందున రంగుగనైదువలూ
నవవధువుల నోముల పేరంటాళ్ళౌచూ
ఇంపుగగూడుకునీ వేడుకపాటలు పాడీ
అనుకూలావాల్లభ్యంపూదీవెనలిచ్చేటీ ॥ వచ్చిందీ ॥
అల్పాయుస్సు కుమారుని యిచ్చిన శంకరునీ
నేలపూల, రెమ్మలజేర్చిన రాజాత్మజనూ
కొలిచిన గౌరివరంబున పట్టిననాగుణ్ణీ
పతి అంగుళితో వాసెన కట్టినసతినీ
తలచండీ నవవధులారా సౌభాగ్యంబునకూ
అక్షతలూ శిరమూల పుణ్యాంగనలుంపా ॥ వచ్చిందీ ॥
వరలక్ష్మివచ్చిందీ వరదాయిని యాచూ,
శ్రావణమున రెండో శుక్రవారమునా

కలలో నాకనుపించిన పార్వతి ఆనతినీ
వ్రత మొనరించిన చారుమతినిదలంచీ
ఆయుమసౌభాగ్యంబును అతివప్రదక్షిణాలూ
పుట్టినమెట్టిన యిండ్లకు పచ్చలతోరణాలూ
నెలకొల్పిన వరలక్ష్మికి వేడుకపాటలుపాడీ
దేశీయత జాతీయత అమరే సంగీతముతోడా
మంగళహారతులిచ్చీ మన్ననసుతి జేసే
ఇహపరసాధనమగు పతి మన్ననసందీ
నెలతరొ! సుఖముండుము మంగళశోభావతివై
అనుగుణవర్తన సర్ప్రదాయములనునేర్చి ॥ వచ్చిందీ ॥
వినతాసుతు మదిదలచీ గాయిత్రినిగొలచీ
రాధామోహను యమునా కేళులదలచీ
సీతామానసహారిని శ్రీహరి నలరించే
ఎడబాయని వరలక్ష్మికి అంజలినిమ్మా ॥ వచ్చిందీ ॥



మహిళల ఆరోగ్యానికి, వారి ఆత్మ వికాసానికి ఔషధముల ద్వారా పత్రికల ద్వారా వారుచేసినసేవ కొలతకు అందనిది. ఆంధ్రమహిళలేగాదు; ఆంధ్రులందరు వారిని,వారిసేవను మరువలేరు.

వారిలోని దివ్య విభూతికి మా జోహార్లు

యస్. శ్రీకంఠమ్.,

ఎడిటర్ - గీతావాణి, కాశీవిద్యాపీఠము, బనారస్ - 2.

# మన దేశ భాషలకు 'నాగరలిపి'



[ఉద్దేశించిన ప్రకారం మేము 'మన దేశభాషలకు నాగరలిపి' యను విషయముపై మీ అనుకూల ప్రతికూల వాదములతో చర్చను ప్రారంభిస్తున్నాము. తమ స్వభాషతో బాటు యితర భాషలను నేర్చుకొనుటవలన తమ భాషకు, వాఙ్మయమునకు మరింత రాణింపు సమకూరుతుందే కాని నష్టము ఏమియుండదు. ముఖ్యంగా మన దేశంలో ప్రతివ్యక్తి పరిసరి ప్రాంతీయ భాషలను నేర్చుకొనడం దేశం యొక్క ఉమ్మడి సౌభాగ్యానికి ఐకమత్యానికి అవసరం. అలాగ నేర్చుకోవడమునకు అవసరమైన సౌలభ్యమును ఉమ్మడి లిపి సమకూరుస్తుంది. అట్టి ఉమ్మడి లిపిగా మనము ఎన్నుకోతగింది నాగరలిపి మాత్రమని కొందరి అభిప్రాయము - ఇక మీది -

సంపాదకుడు]

శబ్దార్థమెఱుంగక మన దేశ భాషలను నాగరలిపిలో వ్రాసిన నిరుపయోగము. కారణమరయ "ఇల్లు" అనుపదమును నాగరలిపిలో వ్రాసిన తెలుగు భాష తెలిసినవారికే ఆ పదము యొక్క అర్థము తెలియును. అటులనే "ఘర్" అను హిందీపదమును, "వీడు" అను అరవపదమును "మనె" అను కన్నడపదమును, నాగరలిపిలో వ్రాసిన ఆ యా భాషలు తెలిసినవారికి శబ్దములయొక్క అర్థము తెలియును గాని తక్కినవారికి తెలియదుగదా? కాబట్టి మన దేశభాషలకు నాగరలిపి దృష్ట్యా నిష్ప్రయోజనము.

ముద్రణాదికములను ఏకలిపి సౌలభ్యమని భావింపుచో, లిపి తెలియనివారు, లిపిని నేర్చికొని, తమ తమ భాషలలోని గ్రంథములను చదువునంతటి సులభముగ చదువలేరు. కావున మన దేశభాషలకు నాగరలిపి అనవసరము.

వాకాటి పెంచలరెడ్డి

◆ ◆ ◆ ◆

తల్లి:- నేను కొడితే ఏడుస్తున్నావు సరే! మీ ఉపాధ్యాయుడు కొడితే ఏమిచేస్తావు?
కుమారుడు:- పుస్తకములు తీసికొని బడికి వెళ్లుతున్నాననా నీ కనుకోసం!

◆ ◆ ◆ ◆

ఒక బిచ్చగాడు:- "బాబూ! భోంచేసి నాలుగయిదు రోజులయింది"
సంపన్నుడు:- అయితే త్వరగా వెళ్లి భోంచేసిరా! లేకపోతే ఒళ్లు చెడిపోతుంది.




**ధ్వనిసారము** : శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మ, సాహితీసమితి, గుంటూరు. వెల రు 1-0-0

ధ్వనిసారము, గీర్వాణభాషాఖనిజమగు నొక యమూల్యరత్నము. ఆనందవర్ధనునిచే నిది సంస్కృత భాషలో వ్రాయఁబడినది. దీనినే శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారు తెనుఁగులోనికిఁ దెచ్చినారు. వీరు తమ ప్రయత్నములోఁ గృతార్థత నొందినారనవచ్చును. సంస్కృతగ్రంథస్థమును; సంగ్రహముగా, సుదాహరణముగా, సులభముగా, స్పష్టముగా, వీరు తెలుఁగువచనమున రచించిరి. ఆంధ్రసాహిత్య లక్షణ పరిజ్ఞానమునకిది యత్యంతోపకారకమని చెప్పకతప్పదు. ఏతద్విద్యార్థులు దీనిసాహాయ్యము నొందుదురు గాక.

దొండపాటి రామమూర్తి

**రత్నగీత** : శ్రీమతి చదలవాడ నాగరత్నము. ప్రచురణకర్త : చదలవాడ కోటి నరసింహముగారు, ఏలూరు.

ఈ గ్రంథకర్త్రి మాకు చిరపరిచితురాలు. ఈమె రచనలు చాల మా పత్రికాముఖమున వెలువడినవి. ఈమె కవితాశైలి మృదుమధురమే కాక చక్కని భావపూరితమై ఉత్తమ ఆదర్శలక్ష్యాల ప్రబోధమున కుపకరించునదిగా నుండును.

ఈ చిన్నగ్రంథములో జాతీయతను, భగవద్భక్తిని, రాజకీయచైతన్యాన్ని, మహిళాపురోభివృద్ధిని, క్రమశిక్షణ, నీతినియమములను ప్రబోధించు చక్కని పద్యములుగలవు. ఇది చిన్న, పెద్ద, స్త్రీ, పురుషులు చదివి సత్ఫలితాలు పొందతగిన గ్రంథము.

**శ్రీ వేణుగోపాలశతకము** : శ్రీమతి పెనుబిల్లి జయలక్ష్మమ్మ. ప్రాప్తిస్థానము రాపూరు, నెల్లూరుజిల్లా

భగవన్నామసంకీర్తనకు గాను శతకవాఙ్మయములో అనేక గ్రంథములు వెలువడినవి. అందులోనిది యొకటి. శ్రీకృష్ణపరమాత్మని మహిమాన్వితమైన గుణగణాలను పేర్కొనుచు యిందలిపద్యములు భగవద్భక్తి సాధకములుగా నున్నవి.

**ఖండకృతి** : శ్రీ జాస్తి వేంకటనరసయ్య, చిలకలూపేరిట, గుంటూరుజిల్లా. వెల 0-8-0.

ఇందలి కవిత్వము నిరాడంబరముగాను, నియమయుక్తంగా నున్నది. పద్యముల సరళి సులభంగాను, మనోజ్ఞంగా నుండి కవిలోని జాతీయభావాలు, సంఘసంస్కరణాశక్తి, దేశభక్తి, నదీప్రవాహంలాగ నడిచినవి భాష బహు పొందికగా నున్నది.

ఈ గ్రంథము బహు జనాహ్లాదకారి కాగలదనుటలో సందియములేదు.

**మీకు వివాహమైనదా?** శ్రీ బి. విశ్వేశ్వరరావు. ప్రాప్తిస్థానము: బి. వి జగన్నాథ్ అండ్ కంపెనీ, 17 కే. యన్. టాంకువీధి, మద్రాసు 1, వెల 0-8-0

ఇది 17 పుటలుగల చిన్న పుస్తకము. ఆకర్షణీయమైన ముఖచిత్రంతో నొప్పుచున్నది. ఇందులో వివాహమునకు సంబంధించిన విషయాలు చర్చించబడినవి.

వివాహంచేసికోడం ఎందుకు? వివాహం చేసేముందు తల్లిదండ్రులు అవలంభింపవలసిన విధానములు, సంసార సౌఖ్యము నుద్దేశించి పెండ్లిచేసికొనబోవువారు, వారితల్లిదండ్రులు పరిశీలించవలసిన సమస్యలు మొదలగునవి ఆలోచనాపూర్వకంగా వివరించబడినవి.

మానవుని జీవితయాత్రలో వివాహము అత్యంతప్రధానమైన సంఘటన కాబట్టి సంఘశ్రేయస్సు దృష్ట్యా యీ చిన్నపుస్తకము బహుళోపయోగంగా నుండగలదని మా నమ్మకము.

మతాధికారి: శ్రీ బి. విశ్వేశ్వరరావు ప్రాప్తిస్థానము: బాబుకార్యాలయం, మద్రాసు 5. వెల 0-2-0

ఇందలికథ బహు సరళంగాను, చదువరుల నుత్సాహపరుస్తూ నడిచింది. ఈ పుస్తకం సందర్భోచితమైన బొమ్మలతోటి బాలల నుద్దేశించి వ్రాయబడింది.

ఇందలి కథయందు జూదమున కలవాటు పడినవారు ఎదుర్కొనవలసిన కష్టనష్టాలు, మతములను బోలిన ధర్మసంస్థల నిర్వాహకులు కలిగియుండవలసిన దయానుగ్రహాలు, ఉదారస్వభావము ప్రతిఫలింపజేయబడినవి.

బాలల సారస్వత సంపద అభివృద్ధికి యీ చిన్నపుస్తకము ఒక చేరిక

విజయవిలాసము: వ్యాఖ్యాత ఉభయభాషాప్రవీణ-సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు. ప్రచురణకర్తలు: వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు 21 వెల రు 3-8-0

ఇది శ్రీ చేమకూరకవి రచించిన విజయవిలాస ప్రబంధమునకు టీకసయితమయిన వ్యాఖ్య. కథావస్తువు అర్జునుడు ఉలూపి, చిత్రాంగద, సుభద్రల వివాహవృత్తాంతము.

ఇందుకుముందే యీ విజయవిలాసమున కనేకపండితులు టీక, వ్యాఖ్యలను రచించిరిగని ఏ ఒక్కటియు సమగ్రమైనదిగాను, సామాన్య ప్రజానీకమునకు సులభగ్రాహ్యమైనదిగాను, సంగ్రహంగాను వెలువడలేదు. శ్రీ వేంకటరమణయ్యగారు శ్రమకోర్చి యింతకుముందు వెలువడిన గ్రంథములందలి లోపములు లేకుండా పండితపామరుల కుపయుక్తంగా యీ గ్రంధరచన చేశారు. వీరు తమ ప్రయత్నంలో కృతకృత్యులైనారనే చెప్పవచ్చును.

పూర్వగ్రంధాలను యీవిధంగా సామాన్యప్రజానీకానికి సయితం అందుబాటులోకి తెచ్చుచు భాషాసేవచేయుచున్న 'వావిళ్ల'వారు అభినందనీయులు.

కృతజ్ఞత: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు, ప్రచురణకర్తలు: రాతు బుక్ డిపో, రాజమండ్రి. వెల రు 1 0-0

ఇది చారిత్రాత్మకంగా ఆంధ్రసామ్రాజ్యమునకు సంబంధించిన పెద్దాపురముసంస్థానపు చరిత్రను, కథావస్తువును తీసికొని రచించిన నవల. రచనరసవంతంగాను, భాషాజ్ఞానము నభివృద్ధిచేయునదిగా నున్నది.

ఇందులో ఆంధ్రసామ్రాజ్యమునాటి ధైర్య పరాక్రమములు, స్వాతంత్ర్య పిపాస, త్యాగములు, విశాల భావములు సమర్ధతతో చిత్రించబడినవి దీనిని చదువుచున్నంతసేపు ఉత్సాహంతో బాటు ఒళ్లుపులకరిస్తుంటుంది. ఇట్టిరచనలు చరిత్రజ్ఞానాభివృద్ధికి చరిత్రాపఠనముయెడల ఆసక్తికి ఎంతైనా నుపకరించగలవు.

# సంపాదకీయములు

## ఆహారము - అనారోగ్యము - చికిత్స

పైమూడు విషయాలకు సంబంధించిన సమస్యల పరిష్కారమునకు ప్రభుత్వము, ప్రజలు, పరస్పరసహకార సానుభూతులతో వ్యవహరించాలి.

బజారులలోను, రోడ్లవెంబడి బహిరంగంగా అనారోగ్యకరమైన వాతావరణములో ఆహారపదార్థముల విక్రయము, తయారీ, ఆహారపదార్థములలో కల్తీ మొదలగునవి గమనించతగినవి.

అనారోగ్యకరమైన వాతావరణంలో తయారీగాని, విక్రయముగాని క్షేమకరంకాదు. పైగా దుమ్ము, ధూళి, ఈగలు, దోమలు ఆశించకుండా తగు రక్షణలు కల్పించక అమ్మబడే ఆహార పదార్థములను తినుటవలన అనేక అంటు వ్యాధులు వ్యాపిస్తున్నవి. భోజ్యములు కాని వస్తువుల కల్తీవలనకాని, అనారోగ్యానికి హేతువైనట్టి పాత్రలలో తయారీవలనకాని ఆహారపదార్థములు ఆరోగ్యమునకు ప్రమాదకరములగుచున్నవి.

పైవానిని అరికట్టి ప్రజారోగ్యాన్ని పెంపొందించుటకు స్థానిక స్వపరిపాలనా సంస్థలు చట్టబద్ధమైన చర్యలతోబాటు తమ తమ ప్రాంత్యాలలో స్వంత అజమాయిషీక్రింద కాఫీ భోజన ఫలహారశాలలను స్థాపించి నిర్వహించడము శ్రేయస్కరము. ఇలా నిర్వహించడమువలన అనారోగ్యవ్యాప్తి అదుపులోనుండగలదు; ప్రజలకు ఆరోగ్యప్రదమైన ఆహారం సమకూరుతుంది.

ఇక ఫలహార భోజనశాలలలో పారిశుధ్యమును గురించి, పాలు, నెయ్యి, నూనెలు మొదలగువానిలో కల్తీ, బెల్లము, చింతపండు మొదలగువానికి దుమ్ము ధూళి, ఈగలు, దోమలు ఆశించడమును గురించి గమనించి ఏది మంచిదో, ఏది ఆరోగ్యమునకు హానికరమో ఎంచుకోవాలి.

తమకు, తమ ఆరోగ్యానికి హానికరమనితోచిన వానిని విసర్జించి నిరోధించుటవలన పరిశుభ్రమైనట్టియు, ఆరోగ్యకరమైనట్టి ఆహారపదార్థములు పరిశుద్ధమైన వాతావరణంలో లభిస్తవి.

ఆరోగ్యమునకు ఆటంకాలు ఎప్పుడుండవో చికిత్సకు అవసరముకూడ తక్కువ. దానితోబాటు చికిత్సా కేంద్రాలు తగువసతులతో ఏర్పడితే క్షయ, కలరాలాంటి అంటువ్యాధుల వ్యాప్తి అరికట్టబడి ఆరోగ్య సౌభాగ్యాలు సమకూరును.

## అ భి నం ద న

రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రిన్సిపాలుగానయిన శ్రీమతి తెలికచర్ల వసుంధరాదేవిగారిని హృదయపూర్వకముగా నభినందిస్తున్నాము.

ఈమె ఇంగ్లండువెళ్లి పెద్ద పెద్ద పరీక్షలలో నుత్తీర్ణురాలయిన విదుషీమణి. అధ్యాపకురాలుగా నీమె గడించిన అనుభవము తాము నిర్వహింప బూనుకొనిన బాధ్యతను శక్తి సామర్థ్యములతో నిర్వహించుటకు విశేషముగా నుపకరించగలదు.

ఈమె నిరాడంబర జీవితం ఎంతటివారికైనా ఆశ్చర్యమును గొలుపును. ఆమెలోని జాతీయత లాంటి ఉత్తమ గుణాలు, వైదుష్యము విద్యార్థులకు ఆదర్శప్రాయము కాగలవు.

వీరు వీరి భర్తగారు విద్యారంగంలో అధ్యాపకులుగానుండి అపారసేవ చేయుచున్నవారు. పైగా నీమె మాధుర్యము నొలికించునట్టి కవిత్వమున్న చెప్పిన శ్రీ అదివూడి సోమనాథరావుగారి కుమార్తె.

ఈ కాలేజి స్థాపించబడిన 100 సంవత్సరములలో ప్రిన్సిపాలుగా నియమితులయిన సుప్రసిద్ధవిద్యావేత్తలలో నీమె మొదటి స్త్రీ.

శ్రీమతి వసుంధరాదేవిగారి యాజమాన్యమున నీ కళాశాల పురోభివృద్ధి పరంపరలుగా నుండగలదని మా విశ్వాసము.

# శ్రీ విజయనామ సం॥ర శ్రావణ-భాద్రపద మాసములు.

| | | |
|---|---|---|
| **1953 సం॥ ఆగష్టు నెల** | | |
| 16 | ఆ | ష. 1-47 స్వా 44-4 రా 27-35 త్యా 4-17 |
| 17 | సో | స 5-0 విశా 48-16 శేషం. 3-20 రా 27-22 త్యా 4-13 |
| 18 | మం | అ 7-21 అనూ 51 30 శేషం. 3-1 |
| 19 | బు | న 8-37 జ్యే 53-39 ది 6-0 త్యా 4-9 |
| 20 | గు | ద 8- 46 మూ 54-34 ది 13-57 ఛప 11-22 మొ 1-0 క |
| 21 | శు | ఏ 7-38 పూషా. 54-15 ది 18-26 త్యా 3-59 సర్వోపవాసః |
| 22 | శ | ద్వా 5-36 ఉషా. 52-46 ది 13-45 దామోదరద్వాదశి. |
| 23 | ఆ | త్ర 1-48 ఏస్వా 55-11 శ్ర 50-18 ది 2-21 త్యా 3-50, ఉపాకర్మ |
| 24 | సో | ○ పౌ పూ 51-30 ధ 46-53 నర్జ్యంలేదు |
| 25 | మం | బ. పాడ్యమి 45-34 శత 42-50 ది 3-40 త్యా 3-44 మంగళగౌరివ్రతం. |
| 26 | బు | వి 38-3 పూభా 39- 22 శేషం. 1-20. |
| 27 | గు | త 32-31 ఉభా 33-5. శూ 45-26 ది ౦-32 త్యా 3- 42 |
| 28 | శు | చ 26-5 రే 29-2 ది 1-37 త్యా 3-42 చతుర్థి తిథిః |
| 29 | శ | పం. 20-2 అశ్వ 25-23 త్యా 3-44 వరా 1-3 మొ 2-34 కు తిధిద్వయం |
| 30 | ఆ | ష 14-37 భ 22-0 రా 19-47 వరా 2-9 మొ 3-41 కు. |
| 31 | సో | స 10-2 కృ 19-31 రా 27-27 మధ్య శ్రీ కృష్ణజయంతి. |
| **1953 సం॥ సెప్టెంబరు నెల** | | |
| 1 | మం | అ 6- 31 రో 18-4 శే. వ ఉ 6- 44 కు. మంగళగౌరివ్రతం. |
| 2 | బు | న 4-8. మృ 17-47 రా 8-16 వరా 9-30 మొ 11-8 కు. |
| 3 | గు | ద 3-5 ఆర్ద్రా 18-47 రా 19-2 త్యా 4-9 |
| 4 | శు | ఏ 3-17 పున 20-58 రా 11-15 త్యా 4-13. సర్వోపవాసః |
| 5 | శ | ద్వా 4 34 పుష్య 24-14 రా 27-46 త్యా 4-17 |
| 6 | ఆ | త్ర 7-9 ఆశ్రే 28-35 శేషః 2-49. |
| 7 | సో | చతు 10-31 మఘ 33-40 ది 1-7 త్యా 4-20 వ ఉ 6-16 మొ 8-0 కు. |
| 8 | మం | ● అమా 14-34 పూఫ 39-18 రా 28-26. |
| | | **భా ద్ర ప ద మా స ము** |
| 9 | బు | శుక్లపాడ్యమి. 18-59 ఉఫ 45-16 శేవ ఉ 7-13 55 9 ద్వితియాతిధిః |
| 10 | గు | వి 23 33 హస్త 51-10 ది 8-20 త్యా 424. శూన్యతిధిః |
| 11 | శు | తదియ 27-56 చిత్త 56-52 ది 13 4 తృతియతిధిః |
| 12 | శ | చ 32-24 స్వా 70-10 ది 12-7. వినాయకచతుర్థి |
| 13 | ఆ | పం. 35-31 స్వా 2-11 ది 17-14 ఋషిపంచమి. |
| 14 | సో | ష 37-41 విశా. 6-39 ది 17-13 సూర్యషష్టి |
| 15 | మం | స 39-1 అనూ. 10-5 ది 24-38 అముక్తాభరణసప్తమి |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd, 15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును: రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

